# జాగరణ

శరత్ అసంపూర్తి నవల

అనువాదం

పురాణం

దేశికవితా మండలి
విజయవాడ-2

II

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జూన్ — 1954
వెల : ముప్పావలా.

దేశీ ప్రెస్,
విజయవాడ —2.



కొండలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

# జాగరణ

బారిష్టర్ మిస్టర్ యమ్. ఆర్. రే బ్రహ్మసమాజానికి చెందినవాడేమీ కాదు. హైందవాచార నియమాల్ని పాటించడు. పాశ్చాత్యదేశాలకు వెళ్ళి తిరిగివచ్చినవాళ్ళ దర్జాను చెందిన మనిషి. తల్లిదండ్రులు ఈ ఏకమాత్ర పుత్రుడికి మొదట శ్రీ రాధామాధవరాయ్ అని పేరుపెట్టారు. ఈ స్వచ్ఛమైనపేరు భవిష్యత్తులో యమ్. ఆర్. రేగా ఘోర పరివర్తన చెందగలదని వాళ్ళు కలలోకూడా అనుకోలేదు. అన్నపానాదులలో, ఆహార విహారాలలోకూడా కొడుకు ఇలా పరివర్తన చెందుతాడని వాళ్లు ఊహించి ఉండరు. అయినా వాళ్ళు ఇప్పుడు సజీవులై లేరు. తమపుత్రుని ఈనాటి స్థితికి వాళ్ళు స్వర్గంలోవుండి సిగ్గుతో తలలు వంచుకుంటున్నారో, కన్నీళ్ళు కారుస్తున్నారో మనకు తెలియదు.

రాధామాధవుని చిన్నతనంలోనే తల్లిదండ్రులు కలరా తగిలి వారంరోజులు వ్యవధానంలో చనిపోయారు. అప్పటికి కుర్రవాడు పాపం మెట్రిక్‌కూడా పూర్తిచెయ్యలేదు. అయినా తల్లిదండ్రులు అతనికోసంగాను—పేదల రక్తమాంసాలతో పెంపువహించిన ఒక జాగీరు, బోలెడంత రొఖం, విశ్వాసపాత్రులైన నౌకర్లనీ విడిచిపెట్టి వెళ్ళారు. కాని ఇదంతా చాల కాలం క్రిందటి సంగతి. అప్పుడు దివానుగా పనిచేస్తూ ఉండిన రాజశేఖరుడేమైనాడో తెలియదు. అతిధి సత్కారాలు, దేవతాపూజలు- అలాంటివన్నీ నేడు బందైపోయాయి. ఇప్పుడు

ఇంగ్లీషు చదువుకున్న పెద్దమనిషి ఒకడు మేనేజరుగా ఉన్నాడు. ఆనాటి మండువా లోగిలి నేడొక ఫేషనబుల్ బిల్డింగ్‌గా మారిపోయింది. దొరగారు పాశ్చాత్య వ్యామోహంలో గొంతువరకు మునిగిపోయారని చెప్పటం కాదు. ఈనాటివరకూ తన ఆస్థిమీద వస్తూన్న ఆదాయంమీదే తననూ తన దర్జానూ పోషించుకుంటూ వచ్చాడు.

రాధామాధవుడు బారిస్టరై స్వదేశానికి తిరిగివచ్చాక తనలాంటి ఒక దొరగారి కూతుర్ని—బాగా చదువుకున్న పిల్లను పెళ్ళిచేసుకున్నాడు — అయోధ్య, బొంబాయి, ప్రయాగ, పంజాబ్ మొదలైన ప్రదేశాల్లో ప్రాక్టీసు చేశాడు. మధ్యమధ్య భార్యా పిల్లలతోసహా మూడు నాలుగుసార్లు విదేశాలు వెళ్ళి వచ్చాడు. కొడుకు డిఫ్తీరియా రోగంవచ్చి చచ్చిపోయాడు. మూడేళ్ళక్రితం భార్యకూడా ఏదో బలువైన రోగంవచ్చి చనిపోయింది. దానితో దొరగారు ప్రాక్టీసుకు స్వస్తిచెప్పేశారు. కావలసినంత డబ్బు లేకపోవటంవల్లనో — భార్య పోయిందన్న వైరాగ్యంవల్లనో — ఏ కారణంచేత నయితేనేం దొరగారు సర్వం విడిచిపెట్టి పశ్చిమ భారత ప్రాంతంలో ఒకపెద్ద పట్నం వచ్చి కాపురం ఉంటున్నాడు. అతనివెంట వచ్చిందల్లా అతని దర్జా కూతురూను.

ఈ విధంగా దొరగారి జీవితం నిర్విఘ్నంగా సాగిపోతూండగా గాంధీమహాత్ముని సహాయ నిరాకరణోద్యమం హఠాత్తుగా ఆరంభమై, గగనచుంబిగా విజృంభించింది. దొరగారి శాంతి, వైరాగ్యము స్వప్నతుల్యములైనవి. రేగిన విప్లవ వాతావరణం అతని హృదయాన్ని కలితం చేసింది. నిర్జయ

నిరాటంక శుద్ధశాంత తపస్వియైన గాంధిజీ చిరతపస్సులో ఆవిర్భవించిన శాంతి ఉద్యమ ఉద్ధానుగతిని నిరోధించగల సామర్థ్యం ఎవరికీలేదు. కాఠిన్యము, దైన్యము, అన్యాయము, అనాచారము యుగ యుగాలుగా గూడుగట్టిన లోభ మోహాది దుర్గుణ సంచయము, తుక్కు-సుమారము-యావత్తూ మహోత్కృష్ట మహోన్నత ఉద్యమ ధారాప్రవాహంలో కొట్టుకు పోతున్నాయి అమంగళకరమైనదేదీ మిగలటంలేదు

కలకత్తానుంచి పోస్టు అప్పుడే వచ్చింది. మేడమీద పడకకుర్చీలోవాలి రేగారు అత్యంత శ్రద్ధాసక్తుడై ఉద్యమ వార్తలు చదువుతున్నాడు. క్రింద పోర్టికోలో మోటర్ చప్పుడయింది. మరిరెండు నిమిషాలకు బాగా ముస్తాబై ఒక జవ్వని చేరువచ్చి నిల్చుంది. ఆమే రేదొరగారి కూతురు. ఆమెపేరు ఆలేఖ్య. శరీరచ్ఛాయ తెలుపుకాదు. బంగాళీదొరల కూతుళ్ళు తెల్లగా ఉండరు. సబ్బులు, పౌడర్లు విరివిగా ఉపయోగించినా అంత ప్రయోజనం ఉండదు. చూడ్డానికి ఆలేఖ్య చాల అందంగానే ఉంటుంది. ముఖకవళికలలోనూ, కన్నుల్లోనూ చలాకీతనమూ, తెలివితేటలూ తొంగిచూస్తూ ఉంటాయి. యౌవనవతి, ఆరోగ్యవతి కావటంచేత మంచి అవయవ సౌష్ఠవం ఉంది. ఇరవైరెండు ఇరవైమూడేళ్ళకు మించని వయస్సు.

"ఇందుగారి బంగళాలో ఇవాళ మా టెన్నిసు టూర్నమెంటు. అక్కడికే వెడుతున్నాను. మళ్ళీ వచ్చేసరికి కొంచెం ఆలస్యం ఔతుందేమో!" అన్నదామె తండ్రితో.

రేగారి దృష్టి పత్రికమీదనించి కూతురువైపు మరలింది. అతనికన్నులు ఉత్తేజితములై ఉన్నవి ముఖకవళికలో

ఆవేగము, ఆశంక తొణికిసలాడుతున్నాయి. కూతురుమాటలు చెవిని పడినట్లులేదు. "చూచావా అమ్మాయి! ఎలాఉన్నాయో పరిస్థితులు! ఇలా ఔతుందని నేను మొదటినించీ చెబుతూనే ఉన్నాను" అన్నాడు ముఖంలోని దీప్తి తగ్గకుండా.

తండ్రి వ్యవహారం కూతురుకు బాగానే తెలుసు. ప్రపంచంలో ఎక్కడో ఏదో జరుగుతూఉంటుంది. అది అలా జరగబోతున్నట్లు ముందుగానే ఆయనకు తెలుస్తూవుంటుంది. ఇంతకూ తండ్రి ఏ సంఘటన దృష్టిలో పెట్టుకుని మాట్లాడుతున్నాడో ఆలేఖ్యకు తెలియదు. అందుచేత అడిగింది: "ఏం జరిగింది నాన్నా!" అని.

రేగారి ముఖదీప్తి ఏ మాత్రమూ తగ్గలేదు. "ఏం జరిగిందా? జరక్కేమౌతుంది? ఇద్దరు విద్యార్థి సత్యాగ్రహుల్ని పట్టుకుపోయారు ఎముకలు విరగకొట్టించి వాళ్ళను మేజస్ట్రేటు జైల్లోవేశాడు. ఇంకా అలాంటి అయిదారుగురు యువకులకు అరెస్టువారంట్లు వెళ్ళాయి. వాళ్ళకేంశిక్ష విధిస్తారో చూడు!" కాసేపు ఊరుకుని "ఏం శిక్ష వేస్తారో నాకు తెలుసు. జైల్లో వేసి అడ్డమైన చాకిరీ చేయిస్తారు. ఆ జైలుశిక్షకూడ పన్నెండు నెలలకు తక్కువఉండదు." అని పంకి ఒక నిట్టూర్పు విడిచాడు.

ఈ మాటలన్నీ శ్రద్ధగా వింటూ కూచోగల స్థితిలో లేదు ఆలేఖ్య. ఆమె మనస్సంతా టూర్నమెంటుమీదే ఉంది. అయినా తండ్రి కొన్నాళ్ళనించీ ఒంటరిగాడు, విచారంలో ఉన్నాడు. అకాల వృద్ధు అటువంటివానిని నిర్లక్ష్యంచేసి ఎలావెళ్ళి పోతుంది? చేరువన ఉన్నకుర్చీమీద వంగి "ఇంతకూ ఆయువకులు చేసిందేమిటి? అని అడిగింది.

"కొంచెంకాను చాలానే చేశారు. గాంధీకి ఉద్యమ ఆశయాలను నలుమూలలా ప్రచారంచేస్తూ తిరిగారు. "మీ రెవర్నీ కొట్టవద్దు, చంపవద్దు. ఆంగ్లేయుడుగానీ, ఎవరైనాగానీ, ఏ వ్యక్తిమీదా ద్వేషభావం అనేది మీ హృదయాల్లోనికి రానీకండి దుష్టము, అధర్మపరాయణము అయిన ప్రభుత్వంతో మీ రేవిధమైన సంపర్కము పెట్టుకోవద్దు. ఉద్యోగాశ పెట్టుకుని దాన్ని ఆశ్రయించకండి. చదువుకోసమని ఆ స్కూళ్ళ ఆవరణలోకూడా కాలుపెట్టకండి. న్యాయంకోసమని ఆ కచేరీలకు పోకండి. ఆ కోర్టుల నీడకూడా మీమీద పడనీకండి— అంటూ దేశీయులకు ప్రబోధిస్తున్నారు"

"అంటే వీళ్లు దేశమంతా అరాజకం చేస్తున్నారన్న మాట!"

"ఏమిటోమరి నాకేమీ బోధపడటంలేదు."

"అలాంటివాళ్ళను జైల్లో వేయ్యాల్సిందే. దేశమంతా నిజంగా అల్లకల్లోలం చేస్తున్నారు.

కూతురు మాటలతో తండ్రి సంపూర్ణంగా ఏకీభవించలేదు. వెనుక ముందాడుతూ అన్నాడు. "ఊహుం. అల్లకల్లోలం చెయ్యటంకాదు. తప్పు ప్రభుత్వానిదీ ఉంది"

ఆలేఖ్యకు ప్రభుత్వమూ, దాని మంచి చెడుగులను గురించి ఎక్కువ తెలియదు. పత్రికలు చదవాలన్న ఆసక్తిలేదు. స్వదేశంలో విదేశాల్లో ఎక్కడ ఏం జరుగుతోందో అని బుర్ర బద్దలుకొట్టుకోటం అనవసరమని ఆమె ఉద్దేశం.

గోడగడియారంకేసి చూచింది. ఇంకా పదినిమిషాల వ్యవధానం ఉంది. తండ్రిగారిని ఒంటరిగా ఇంట్లోవిడిచి పోయే

ముందు ఆయన మనస్సుకు కాస్త తృప్తి, ఉల్లాసం కలిగించు దామన్న ఊహతో అన్నది: "పైకి ఎలా మాట్లాడినా నీకు మనస్సులో వాళ్ళంటే ప్రేమే నాన్నా! ఆనాడు హర్తాళ్ చేసి నప్పుడు ఈ ఆందోళనపరులంతా రాళ్లురువ్వి ఇందుగారి మోటారు గాజుపలక ముక్కలు ముక్కలు చేసినప్పుడు... నువ్వు ఆ సంగతంతా విని "ఇంత బ్రహ్మాండమైన ఉద్యమం సాగుతున్నప్పుడు అటువంటి చిన్నచిన్న దుర్ఘటనలు జరుగు తూనే ఉంటాయి' అన్నావు. అప్పుడు ఇందుతండ్రి ఉన్నాడు. ఆయనకుగాని గాయం తగిలినట్టయితే?"

"కాదు-కాదు. నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావు ఆలేఖ్యా! అటువంటి దుశ్చర్యల్ని నేను సహించను. వాళ్ళను శిక్షించాల్సిందే. కాని నేనన్నది ఏమిటంటే-ఆనాడు ఘోష్ బాబు కారెక్కి బైటికిరావడం సబబైన పనికాదు. అనేకులైన దేశప్రజల పట్టుదలతోకూడిన అనురోధాన్ని తిరస్కరించటం మంచిదా?"

"అనురోధానికి ప్రత్యనురోధం ఉండనే ఉంటుంది. అను చితంగా ఒకరు విరోధించినప్పుడు గమ్మున సహించి ఊరుకో వటం పురుషలక్షణమౌతుందా? అంతసాహసంగా బైటికి వచ్చినందుకు ఇందుతండ్రి నిజంగా అభినందనీయుడు." ఆలేఖ్య స్వరంలో ఒక తీవ్రత కనిపించింది.

రేగారుకూడా కొంచెం ఉత్తేజితుడైనాడు. "అవి అను చితమైన విరోధం అని నీకేం తెలుసు?"

"తనకారులో ఎక్కి తాను బైటికి రావటానికి తనకు పరిపూర్ణాధికారం ఉంది. దానికి ఎలాంటి ఆటంకం కలిగించినా అది అన్యాయమే అనిపించుకుంటుంది."

"మామూలు మాటే చెప్పావు తల్లీ !"

"ఔను-మామూలుమాటే చెబుతున్నాను. ప్రపంచంలో సాహసపూర్వకంగా ఆలోచించి అలా చెప్పేవాళ్ళ సంఖ్యే ఎక్కువగా వుంటుంది."

ఆ రోజున మోటారు గాజుపలక పగిలిపోయింది. ఈ దుర్ఘటన గురించి ఇందుగారింట్లో చాల పెద్దచర్చే జరిగింది. అదంతా ఆలేఖ్య స్మృతిపథాన్ని ఆవరించి వుంది. ఆమెస్వరం మరెంతతీవ్రతరం అయింది. అన్నది: "ఆయనగారి తప్పేమీకాదు. తప్పంతా ఆ స్వదేశీ గూండాలదే. నిస్సందేహంగా చెబుతున్నాను."

రేగారి ముఖం వెలవెల బోయింది. ఆలేఖ్యాకు మరో విషయం స్ఫురణకు వచ్చింది. ఆనాడు తనతండ్రి అస్వస్థతగా వున్నా ఆసుపత్రికి కాలినడకనే వెళ్ళాడు; కాలినడకనే తిరిగి వచ్చాడు. ఈ పనిని తాను విమర్శిస్తున్నట్టుగా తనమాటలు తండ్రికి ధ్వనించాయేమోనన్న సంకోచం ఆలేఖ్యాకు కలిగింది. ఆయన అస్వస్థుడు దుర్బలమైన మనస్సు. కనుక తన జీవితంలో కుటుంబ వ్యవహారాలు మినహాయిస్తే తానుచేసిన ఘనకార్యం ఏమీలేదు, మిత్రులు, శత్రువులు ఆయన్నుగూర్చి అనేక రకాలుగా అనుకుంటూ వుండేవారు. భార్యకూడా ఎప్పుడూ ఆయన్ను విమర్శిస్తూనే వుండేది, ఆ విమర్శనల ఫలితం ఏమన్నా వున్నదాఅంటే ఏమీలేదు. జీవితంఅంతా ఇలాగే గడిపాడు ఇప్పుడు ఈ చివరిదశలోనూ కూతురి నోటివెంటకూడా ఎత్తిపొడుపు మాటలేవస్తే ఆయన పరితాపానికి అంతు వుంటుందా?

ఆలేఖ్య కొంచెం పశ్చాత్తాప పడ్డది. మరింత దగ్గరగా వచ్చింది. తండ్రి రొమ్ముపై చేయివుంచి ప్రేమగా "నీ ఏపనీ నేను అనుచితంగా, అన్యాయంగా భావిస్తానని అనుకోకు నాన్నా!" అన్నది.

ఈ మాటకు రేగారు క్షణమాత్రం ఆశ్చర్యాన్వితుడైనాడు.

"ఏపనితల్లీ?" ఆనాటి విషయం ఆయన మనస్సులో నించి ఎప్పుడో పోయింది.

ఆలేఖ్యముఖాన్ని తండ్రిముఖానికి దగ్గరగా తెచ్చింది. "ఏంపనీ లేదునాన్నా! ఏంపనీ లేదు. చెడ్డపని నువ్వసలు చెయ్యనేలేవు. ఆ రోజు నువు సుస్తీగా వుండీకూడా డాక్టరు దగ్గరకు కాలినడకనే వెళ్ళావు. వచ్చావు- అందుకు కారణభూతులైనవాళ్ళ దౌర్జన్యం సామాన్యమైనదా? పెద్ద అత్యాచారం కాదూ!"

రేగారికి ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. వాత్సల్యం పొంగివచ్చి కూతురుతలపై చెయిపోనిచ్చి నిమురుతూ, "అందుకనేనా నువు ఆందోళనపరులపై అంత కోపపడుతున్నావు?" అని అడిగాడు.

"కోపం కాదామరి!" ఆలేఖ్య క్రోధఘూర్ణిత స్వరాన పలికింది. తండ్రిని మరిపించటం, మురిపించటం ఆమెకంత కష్టమైన పనేమీకాదు.

రేగారు మందహాసం చేశాడు. "అదికాదమ్మా! కోపపడటం మంచిదికాదు. వాళ్ళపని నాకునచ్చింది. చిన్నాపెద్దా- ఉచ్చము నీచము-అనే విభేదాలు లేకుండా అందరూ సమా

నంగా కాలినడకన వెళ్ళారానాడు. భగవంతుడిచ్చిన పాదాల్ని ఉపయోగించుకోటంలో సిగ్గెందుకు? ఎన్నడూ కలగని జ్ఞానం నాకానాడు కలిగింది. ఆ సన్నివేశం చాలదినాలవరకూ నా హృదయంలో ముద్రితమై వుంటుంది చెప్పొద్దూ!"

అదికూడా ఒక యుక్తేనా? ఆలేఖ్య తనలోతాను నవ్వుకుంది. ఏమీ మాట్లాడలేదు. ఆ విషయమై ప్రసంగం పెంచటం యుక్తం కాదనిపించింది. గడియారంలో అయిదు కొడుతోంది. "నువ్వుకూడా రారాదు నాన్నా! మా టూర్నమెంటు చూద్దువుగాని. నువ్వొస్తే ఇందు తల్లిగారు ఎంతో సంతోషిస్తుంది."

భార్య పోయినప్పటినించీ ఆయన ఇల్లుదాటి బైటికి పోవటంలేదు. ఇల్లు, అందులోని సామాను- అదే ఆయన సమస్త విశ్వమున్నూ. పనీపాటా ఏమీ లేకుండా సుఖంగా కాలం గడుపుతున్నాడు. అందువల్ల శరీరారోగ్యమూ బాగుండటంలేదు. అయినా బైటికెక్కడికేనా వెళ్ళాలనుకుంటేసరి చలిజ్వరం పెట్టుకొస్తుందాయనకు నేనుమాత్రం కూతురు బైటికి వెడదాం అనేసరికి అకారణ చిహ్నాలున లేచికూచున్నాడు. అప్పుడే వెడదామా? ఈ సమయంలోనా?" అన్నాడు.

అందుకు కూతురు పక్కున నవ్వింది. బైటికి వెళ్ళటానికి సరైనవేళ ఇదేనాన్నా!"

కాని చాల వుత్తరాలు రాయాల్సివుందే. సరే నువ్వు వెళ్ళులే. మళ్ళీ త్వరగారా. పొద్దుపోనీకు. ఈలోగా వుత్తరాల పని ముగిస్తాను" అంటూ రేగారు మరల వార్తాపత్రికాపఠనలో మునిగిపోయాడు.

ఆలేఖ్య! పిల్లకపేరు తల్లి పెట్టింది. నవీనతా ప్రియత్వం వల్ల ఆపేరు పెట్టివుంటుంది. తండ్రికిమాత్రం ఈపేరు ఏ మాత్రం ఇష్టంలేదు. ఆపేరు వుచ్చరించాలన్నా అతనికేదో బాధగానే వుంటుంది. ఆమెను పిలవాల్సివస్తే 'ఆలో' అని మాత్రమే పిలుస్తాడు. లోకులుకూడా ఆమెను అలాగే పిలుస్తారు. బాల్యంనించీ ఆమెకు ఇందుతో పరిచయంవుంది. ఇందు తల్లి, ఆలేఖ్యతల్లి-ఇద్దరూ ఒకేబడిలో బోర్డింగులో వుండి కలసి చదువుకున్నారు కొంతకాలం. ఇద్దరిమధ్య మంచి సన్నిహితత్వం వుండేది దగ్గర బంధువులులా వుండేవాళ్ళు. ఇందు అన్న కమలకిరణ్ బారిష్టరు చదటానికి విదేశాలు వెళ్ళాడు. తిరిగివచ్చాక ఆతన్ని అల్లుడుగా స్వీకరించటానికి ఆలేఖ్యతల్లి నిశ్చయించుకుంది. ఆమె స్నేహితురాలికికూడా అది అంగీకారమే.

నిరుడే కమలకిరణ్ కె. కె. ఘోష్‌గా మారి స్వదేశానికి వచ్చాడు. తల్లిదండ్రులు రేగారికి ఆయన ధర్మపత్ని వుద్దేశాన్ని జ్ఞాపకంచేశారు. కాని రేగారు ఔననిగాని, కాదనిగాని ఏమాటా చెప్పకుండా కాలయాపన చేస్తున్నాడు. ఒక స్థిర నిశ్చయానికి రాలేకపోతున్నాడు. మానసిక దుర్బలతకైనా ఒక అవధి వుండదూ! టూర్నమెంటు చూడ్డానికి ఇందుగారింటి నించి వచ్చిన ఆహ్వానాన్ని త్రోసివేసి రేగారు ఎందుకు పత్రికా పఠనంలో నిమగ్నులైనారో ఆ రహస్యం ఆలేఖ్యకు గ్రాహ్యం కాకపోయినా ఇందుతల్లికి మాత్రం బాగానే తెలుస్తుంది. తన కోడలుగా చేసుకోటానికి ఆమె ప్రయత్నాలు ఇప్పటికీ సడలలేదు.

అలేఖ్యలాంటి ఆడపిల్లలు రూపవంతులు గుణవంతులు సంఘంలో లేకపోలేదు. కాని ఆలేఖ్యలాగా బోలెడంత పిత్రీయమైన ఆస్తితో వచ్చే పిల్లలు మాత్రం లేరు. ఆ సంగతి ఇందు తల్లికి బాగా తెలుసు. కమలకిరణ్ కూడా మామూలు యువకుడు కాదు. చదువుకున్నాడు, అందగాడు బారిష్టరు పనిలో బాగా అనుభవం పండిన తండ్రిదగ్గర జూనియర్ గా పనిచేస్తున్నాడు. అతనికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు వుంది.

తన్ను కమలకిరణ్ కు ఇచ్చి వివాహం చెయ్యాలన్న కోరిక తనతల్లికి ఉన్నట్లు ఆలేఖ్యకు తెలుసు. ఆ విషయమై ఇందుగాని, ఇందుతల్లి గాని ఆమెతో ప్రసంగిస్తూనే వుంటారు. ఇంతవరకూ రేదారగారే సంశయాత్ముడై ఏ నిశ్చయానికీ రాలేకపోతున్నాడనీ, ఆయన ఎప్పటికైనా ఒక నిశ్చయానికి వచ్చేంతవరకూ తామె తొందరపడటం బాగుండదనీ - వరపక్షీయుల అభిప్రాయం.

“నాకేవిధమైన అనుమానమూ లేదు. రేగారికి ఏమన్నా అభ్యంతరం ఉంటే పిల్లను మనింటికి ఎందుకు రానిస్తాడూ? దానిటికే అదిపోతోంది అని ఊరుకుంటున్నాడు - ఔనుకదూ ఆంగో!” అని ఇందుతల్లి అప్పుడప్పుడు ఆలేఖ్య సమక్షంలోనే తనభర్తతో అంటూవుంటుంది.

కమలకిరణ్ సమక్షంలో ఆలేఖ్యకు కణతలు వేడెక్కిపోతాయి. “మీరు మా అమ్మలాంటి మనుషులు. ఆ సంగతి మానాన్నకు బాగా తెలుసు” అంటుంది, ఆలేఖ్య అతనితో సంకోచిస్తూనే మరెవరూ మగవాళ్ళు దగ్గరలేనప్పుడు.

ఈ విధంగా సంవత్సరం గడిచిపోయింది.

‘టెన్నిస్ టూర్న’మెంటు అయిపోయింది. ఆ తరువాత తేనీరు విందు జరిగింది. అప్పటికే చాల ఆలస్యం అయింది. ఆలస్యం అయిందన్న భావం ఆలేఖ్యకు స్ఫురించనే లేదు. ఆమె టెన్నిస్ చాల బాగా ఆడుతుంది. కాన్పూరునుంచి వచ్చిన ఒక ఆటకత్తెను ఆమె ఈ టూర్నమెంటులో ఓడించింది. ఆమె మనస్సు విజయోత్సాహంతో నిండివుంది. ఇంకా ఏదో గీతిక పాడుతోంది. ఆలేఖ్య దృష్టి గోడగడియారంమీద పడింది. అప్పుడామెకు చాల ఆలస్యమైన విషయం స్ఫురించింది. తండ్రి జ్ఞాపకం వచ్చారు. వెంటనే లేచింది. అక్కడచేరిన సభికుల అనుజ్ఞ గైకొని వెళ్ళాలన్న సామాన్య సభ్యతకూడా పాటించకుండా కిందికిదిగి వచ్చేసింది.

మోటారు తయారుగానే వుంది. శోఫర్ తలుపు తెరచాడు. ఆలేఖ్య లోపలికి ఎక్కి కూచుంది. అలసిన శరీరాన్ని ఆ మెత్తని పరుపులలో వాల్చింది. అది చీకటిరాత్రి కాదు. వెన్నెల కాస్తోంది సమీపాన్నే బాగాపూచిన ఏ లతా కుంజం నుంచో సువాసనలు వీస్తున్నాయి. బాగా ఆటలో అలసిపోయిందామె. అయినా ధమనులలో యౌవనరక్త ప్రసారం తీవ్రంగా వుంది. "ఈ విధంగా వాళ్ళకు మాటైనా చెప్పకుండా పారిపోయి రావటం ఏం బాగుంటుంది?" అని మనసులో ఆలోచన వచ్చింది. ఆ మరుక్షణమే పరిచిత కంఠధ్వని "పారిపోయి వచ్చావా?" అని చేరువనే వినిపించింది.

ఆలేఖ్య వులిక్కిపడ్డది. "ఎవరు చెప్పారు!"

కమలచరణ్ మందహాసం చేశాడు. "నాకుతప్ప నువ్వు

పారిపోయి రావటం ఎవరికీ తెలియదు. నా సూక్ష్మదృష్టిని మోసంచెయ్యటం చాలకష్టం అంతే! తెలుసునా?"

ఆలేఖ్య ముఖలక్షణాలు ప్రస్ఫుటంగా కనిపించటానికి వెన్నెల అంత ప్రకాశవంతంగా లేదు. ఆమె తన్నుతాను సంబాళించుకుని అన్నది: "మీకు తెలుసుకదా! ఇంటిదగ్గర మా నాన్నగారు ఒక్కరే వున్నారు. రాత్రిళ్లు నేను ఆలస్యంగా ఇంటికి వెళితే ఆయన చాల ఆందోళన పడతారు."

"అయితే సరే, త్వరగా వెళ్ళిపో"

మోటారు స్టార్టు అయింది. శోఫరు డ్రైవు చేయబోతున్నాడు. కమలకిరణ్ మెల్లిగా ఆమె చెవిదగ్గర ముఖంపెట్టి "నిన్ను ఇంటిదాకా దిగబెట్టిరానా?" అని అడిగాడు.

ఆలేఖ్య సంకోచావస్థలో పడ్డది. "వద్దంటే" అని చెప్పలేకపోయింది. "మళ్ళీ తిరిగి ఎలావస్తావు?" అని అడిగింది.

"తిరిగి రావల్సిందేనన్నమాట! రేయి ఎంత సుందరంగా వుందో చూడు, మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ వచ్చేస్తాను."

తలుపు తానే తెరచుకుని కమలకిరణ్ లోపలికి వచ్చాడు. ఆలేఖ్య పక్కనే కూచున్నాడు.

ఎక్కువదూరం కాదు. అయిదారు నిమిషాల్లో ఇల్లు చేరవచ్చు. ఈకాసేపటిలోనే ఎన్ని విషయాలైనా అవసరమైతే మాట్లాడుకోవచ్చు. కాని ఇద్దరూ మౌనంగానే వున్నారు. సరసనే కూచున్నారు. మోటారు రేగారి పోర్టికోలో ప్రవేశించి ఆగింది. కారుచప్పుడువిని మేడమీద తండ్రిగారు పిట్టగోడదగ్గరకు వచ్చి చూస్తారేమోనని ఆలేఖ్యభయం. కాని

అటువంటిదేమీ జరగలేదు. ఇద్దరూ మోటారులోనుంచి దిగారు. పైకి వినిపించనంత తిన్నగా వీడుకోలు వాక్యం పలికి ఆలేఖ్య హాల్లోకి వెళ్ళిపోయింది.

"అయ్యగారేరీ?" అని అడిగింది.

నౌకరు నమస్కారంచేసి జవాబుచెప్పాడు "పైన వున్నారు"

ఆలేఖ్య మెట్లెక్కి పైకివెళ్ళింది. అంతా నిశ్శబ్దంగా వుందక్కడ. అలమార తెరిచేవుంది. కాగితాలన్నీ చెల్లా చెదరుగా వున్నాయి. తండ్రి ఇద్దరు నౌకర్ల సహాయంతో రెండు పెద్దపెద్ద పెట్లెల్లో కాగితాలూ, పత్రాలూ సర్ది పెడుతున్నాడు.

"ఇదంతా ఏమిటినాన్నా! ఎక్కడికేనా ప్రయాణమా?"

ఆయన కూతురువైపు చూచాడు. లేచినిల్చున్నాడు. "చూచావా అమ్మా! ఎంత కాండ జరిగిందో! నేను అప్పుడే చెప్పాను: గాంధీ సర్వనాశనం చేసేస్తాడు. ఈ స్వదేశీగూండాలు పట్నాన్ని అల్లకల్లోలం చేస్తారని నాకు మొదలే తెలుసు..."

జేబులోనుంచి ఒక కాగితంతీసి రేగారు దాన్ని కూతురివైపు విసిరాడు "ప్రభుత్వం వీళ్ళను జైల్లో వెయ్యకపోతే పట్నం యావత్తూ తల్లకిందైపోక తప్పదు."

ఇందాక రెండుమూడు గంటలక్రితం రేగారు పలికిన మాటలకూ ఇప్పుడంటూన్న మాటలకూ ఎంత తేడా! ఆలేఖ్య ఏమీ బదులుచెప్పలేదు. ఆ కాగితం పట్టుకుని లాంతర వెలుగులో ఆతృతగా చదివింది. తమ జాగీరు మేనేజరు రాసిన ఉత్తరం అది. అతడు విచారపడుతూనే – అంటే క్రోధం పత్రిక

టిస్తూనే జారీరు పరిస్థితులేమీ బాగాలేవనిరాశాడు. ఎస్టేటులో కూడా వుద్యమం వ్యాపించింది. ఏంచెయ్యాలో యజమానుల ఆదేశాన్ని అర్థిస్తూ వుత్తరంమీద వుత్తరం రాశాట్ట. కాని ఇక్కడినుంచి ఏమీ జవాబు తనకు అందలేదుట. ఆందోళన కారులకు ప్రజల సహాయం లభిస్తోంది. గూండాలు పెచ్చరిల్లి పోయారు. మేనేజర్ని కూడా అవమానించటానికి దొరకొన్నారు. అమరపురి బజారులో విదేశవస్త్రాల్ని స్వాధీనం చేసుకున్నారు. కచేరీ గుమాస్తాలు, నౌకర్లతో సహా మేనేజరు అక్కడేవున్నాడు. అయినా గూండాలు ఏమీ భయపడకుండా విజృంభించారు. ఇందువల్ల ఎస్టేట్ ఆదాయం చాల తగ్గిపోయే ట్టుగా వుంది. మేనేజరు వెళ్ళి మేజస్ట్రీటు సహాయాన్ని అర్థించాడు. ఆందోళనపరులు రైతుల్ని కూడగట్టుకుని తహశీళ్ళు ఇవ్వవద్దని ప్రేరేపిస్తున్నారు. లూటీలు జాస్తిఔతున్నాయి. ఎస్టేటుదార్లు సర్కారుకు శిస్తులు చెల్లించాల్సిన తరుణం వచ్చి నెత్తిమీద కూర్చుంది. ఇంతవరకు రెండు కోట్లుకూడా వసూలుకాలేదు. వెంటనే ఏదో ఉపాయం ఆలోచించాలి. ఎస్టేటుదారు వస్తేతప్ప జరగతగిందేమీలేదు.

వుత్తరం అంతా చదివేసరికి ఆలేఖ్యముఖం వివర్ణం అయింది. "అయితేనాన్నా నువ్వే స్వయంగా వెళుతున్నావా!"

"మరి వేరేమార్గం ఏముంది? వెళ్ళి వెంటనే తిరిగివస్తానమ్మా! ఒక్కరోజులో అంతా సవ్యంచేసిరాను? ఘోష్ బాబుతో చెప్పివెడతాను. ఆయన వుదయం సాయంత్రం

రెండుపూటలావచ్చి నీ క్షేమం కనుక్కొని వెడుతూవుంటాడు. నీకేం కష్టం వుండకుంతే ”

ఆలేఖ్య ఆ మాటలు వినిపించుకోనేలేదు. “మేనేజరు ముందుగానే తెలియజేసినా నువ్వేమీ చర్య తీసుకో లేదు ”

“చర్య తీసుకోలేదా? ఏం చెయ్యలేదంటావా? చెయ్యకేం అమ్మా! బహుశః వృత్తాంతం రాశేవుంటాను.”

ఆలేఖ్య తండ్రిముఖంలోకి అలాచూస్తూనే వుండిపో యింది. “నువ్వు మరచిపోయి వుంటావునాను నాన్నా !”

రేగారి కంఠస్వరం మందగించింది. “ఎందుకు మరచి పోతానమ్మా ఆనాడే జవాబు రాశాను: ‘విదేశ వస్త్రాల్ని ధరించటం ప్రజలకు ఇష్టంలేకపోతే వాటిని మనం అమ్మటం వల్ల ప్రయోజనంలేదు. వాటిని మనం తెప్పించి లాభంలేదు. పైగా చాల నష్టం కష్టం కూడాను అని”

“అలాగని ఎవరికి రాశావునాన్నా? నీ వృత్తాంతం ఎవీచేరి నట్టు మేనేజరు రాయలేదే!”

రేగారి ముఖం చింతాముద్రితం అయింది. “కలకత్తా నుంచి అప్పుడెవరోవచ్చి రైతులకూ కార్మికులకూ రాత్రి పాఠ శాలలు నడపటానికి నా అనుమతి అడిగారు. అందులో నష్టం ఏముందీ! వాళ్ళేదో చేసుకుంటారు. మనకేం. మనఆదాయం మనకు వస్తుంటేసరి.”

“మనగ్రామంలోకూడా రాత్రి పాఠశాల తెరిచారా?”

రేగారు సగర్వంగా చెప్పాడు: “ఎందుకు తెరవలేదూ? నేనే స్వయంగా తెరిపించాను. గ్రామంలోవున్న నాట్యభవనం

ఖాళీగానేవుందిగా. అందులోనే. కిర్సనాయిలు ఖర్చైగా మనకు తగిలేది !"

"కిరసనాయిల్ ఖర్చు కచేరీనుంచే పంపుతున్నారన్న మాట."

"అలాగనే హుకుం ఎప్పుడో జారీచేశాను. ఇప్పుడు పంపించటంలేదేమో ! నేనేంచేస్తాను ఇక్కడినుంచి ?"

చాలసేపటివరకూ తండ్రిముఖంలోకి చూస్తూవుండి ఆలేఖ్య చివరకు అన్నది. "నువు ఆ గదిలోకివెళ్ళి కూచో నాన్నా ! అంతా నేను సర్దుతాను. నీతోపాటు నేనూ ప్రయాణమే."

"నువ్వానా !" ఆశ్చర్యంగా అడిగారు రేగారు.

"ఔను. నేను రాకపోతే మనపనులేమీ కావు"

## ౨

తమపూర్వులు తరతరాలుగా కాపురంవుండిన ఆ యింట్లో చాలకాలానికి అడుగుపెట్టింది. ఆలేఖ్య వయసు పెద్దది కాదు. అయినా మూడుసార్లు విదేశయాత్ర వెళ్ళివచ్చింది. ఇంచుమించు ప్రతియేడూ డార్జిలింగుకో, సిమ్లాకో వెడుతూనే వుంటుంది. అనేక టీ పార్టీలలోనూ, డిన్నరు పార్టీలలోనూ పాల్గొన్న యువతి. తల్లి బ్రతికివున్న రోజుల్లో అనేక విందులు పార్టీలూ జరిగాయి. అన్నీ ఆలేఖ్య జాగ్రతగా నిర్వహిస్తూ వుండేది. సంఘసభ్యతలు, మర్యాదలు ఆమెకు బాగానే తెలుసు. ఆటలు, పాటలు, సంభాషణాచాతుర్యం ఆమెకు ఎప్పుడు ఎటువంటి డ్రెస్ ఉచితంగా వుంటుంది. ఏ చీరకు ఏ

జాకెట్ సరిపోతుంది. ఈ మొదలైన అంశాలన్నీ ఆమెకు బాగా తెలుసు. అభిరుచులు, వేషముల విషయంలో ఆమెకు సమగ్రంగా తెలుసు. ఏ వసువు ఎక్కడినుంచి ఎలా వస్తుంది? అనే విషయం ఒక్కటే ఆమెకు తెలియనిదై ఉండాలి.

తల్లికిమల్లే నే ఆమెకూ ఒకభావం పడిపోయింది. తమ ఎస్టేటులో ఒకొక్కగ్రామం ఒకొక్క కల్పవృక్షం అని. ఈ భావంతోనే వాళ్ళు నిశ్చింతగా వుంటున్నారు. పనీపాటా చేయనక్కర్లేదు; పరిశ్రమ అనవసరం; నీళ్ళు పొయ్యనక్కర్లేదు; దోహద క్రియల అవసరంలేదు; ఎప్పుడు కావలిస్తే అప్పుడు కొమ్మలనిండా బంగారం నిండివుంటుందని వాళ్ళఊహ. అంతే గాని వాస్తవిక పరిస్థితులను గుర్తించటంగాని అర్థం చేసుకోవటంగాని తల్లికి చాతకాలేదు. ఇంట్లో జరగవలసిన దుబారా ఖర్చులన్నింటికీ డబ్బు పోగుచేసి వుంచటానికి రేగారు ఎంత శ్రమపడవలసి వచ్చేదో – అప్పుడప్పుడాయనెంత విచారంగా వుండేవారో – కూతురుమాత్రం గమనిస్తూనే వుండేది. "ఇన్ని ఖర్చులు లేకుండా మనకు కాలం గడవకపోదు" అని రేగారు తరచు భార్యతో అంటూవుండటం ఆలేఖ్య ఎరుగును. దానికి తల్లి "సంఘసభ్యత దృష్ట్యా ఇంతమాత్రంకూడా ఖర్చు చెయ్యకుండా నిర్వహించటం అసంభవం" అని జవాబు చెప్పటం కూడా ఆమె వింటూవుండేది.

రేగారు భార్యమాటకు ఎదురుచెప్పేవారు కాదు. నోరుమూసుకుని చేతనాశూన్యుడులా వుండిపోయేవారు. భార్య ప్రతిదానికి ధూంధాం చేస్తూంటే ఏ గృహస్థుకైనా వైరాగ్యం కలిగితీరుతుంది. కాని రేగారి విచారంమాత్రం

మూడునిమిషాల్లో మాయమైపోయేది. ఇంట్లో, విందులో, ఉత్సవాల్లో, ఆటలో, పాటలో ఆరంభమై మిస్టర్ అముక్ బాబు వచ్చారు, వారు వచ్చారు, నీరు వెడుతున్నారు అనే మాట లతో ఒక ఉత్సాహకర వాతావరణం ఏర్పడేసరికి ఆయన నిర్లిప్తత, స్తబ్ధత పటాపంచలై పోయేవి. తనలో తాను తన స్థితిగతుల్ని గూర్చి విచారించుకోటానికి వ్యవధి వుండేదికాదు.

ఆలేఖ్యకు చిన్నతనం అంతా ఇలాగే గడిచింది. పెద్ద అయినా ఇలాగే గడుస్తుందని తల్లి నమ్మకం. కాగా ఆమె కూతుర్ని తదనుసారమైన వాతావరణంలోనే పెంచింది.

తండ్రీ కూతురు స్వగ్రామం వచ్చి అయిదారు రోజు లైంది. జమీందారీ భవనం చాలపెద్దది. నూతనపద్ధతులతో గొప్పవారి అభిరుచులకు తగినట్టుగా నిర్మించారు. అన్ని వీళ్ళూ, వసతులూ వున్నాయి. అయినా ఆ యింట్లో వుండటం ఆలేఖ్యకు ఏదో అసౌఖ్యంగా కనిపించింది. హాలు, భోజనశాల, పడకగది వీటన్నింటిలోను గోడలకు మళ్ళీ చక్కగా రంగు వేయించాలి. లేకపోతే ఆ యింట్లో ఆలేఖ్య ఉండలేదు. దరవాజాలకు కిటికీ లకు తాను దగ్గరవుండి వార్నిష్ పూయించాల్సిందే. ఏం అందంగాలేవు. మట్టిగొట్టుకుని అసహ్యంగా వున్నాయి. ఉహుఁ. చూస్తూ చూస్తూ ఈ యింట్లో ఉండటం చాలకష్టం. ఏమైనాగానీ నాలుగైదు వేలు ఖర్చుపెట్టి బాగుచేయించా ల్సిందే.

ఈ వ్యవహారమంతా చెప్పటానికి ఆలేఖ్య ఉదయం తండ్రిదగ్గరకు వచ్చింది. అప్పుడాయన ఒక యువక బ్రాహ్మణ అధ్యాపకునితో మాట్లాడుతూ వున్నాడు. కూతురు రాగానే

నూతన వ్యక్తిని ఆమెకు పరిచయంచేశాడు. "ఏరు పండిత అమరనాథ్ న్యాయరత్న. మన పురోహితులవారి దౌహిత్రుడు మన ఎస్టేటులోదే బారహాపురంలో వంశపారంపర్యంగా వస్తున్న తమ పాఠశాల నడుపుకుంటున్నారు. వారికి నమస్కారం చెయ్యాలి!"

ఆమాట వినేసరికి ఆలేఖ్యకు వొళ్ళు మండిపోయింది. ఒక్క గురువుగారికి తప్ప ప్రపంచంలో మరెవరికీ ప్రణామం చెయ్యకూడదని ఒక రివాజు ఉంది. ఇంతకూ ఈ పెద్దమనిషి తమ పురోహితుల వంశంలోవాడు. ఈ పురోహితజాతిని గురించి ఆమె చిన్నప్పటినించే అనేక ఆక్షేపణలు వింటూంది. పండితులూ, పురోహితులూ అనబడే వాళ్ళంతా కూపస్థమండూకాలూ; వాళ్ళకు విశాల దృక్పథంలేదు; దేశాన్ని అధోగతికి తీసుకు పోతున్నవాళ్ళు వీళ్ళేనని ఆమెకొక స్థిరమైన ఊహ నరనరాల్లో జీర్ణించి వుంది. వీళ్ళపట్టుదలవల్లనే, వీళ్ళ వైరుధ్యం వల్లనే తాము హిందూసమాజంనించి బహిష్కృతులు. అటువంటి ఒక పెద్దమనిషి పాదాలమీద వాలటం అంటే ఆలేఖ్య నరనరమూ ఎదురు తిరిగింది. కాని తండ్రి ఆదేశాను సారం చేతులు మాత్రం జోడించి మామూలు నమస్కారం చేసింది. ఈ నమస్కారానికి అతడేమీ బదులు పలుకలేదు. ఆలేఖ్య వైపు అలాగే వింతగా చూస్తూ ఉండిపోయాడు. ఆలేఖ్య స్థాణువుగా నిల్చిపోయింది

ఆమె తండ్రితో మాట్లాడిపోదామని వచ్చింది. అపరిచితుణ్ణి అపరిచితుడుగానే వొదిలేసి తండ్రితో సంభాషణ ఆరంభించింది: కాని ఆ అపరిచిత అధ్యాపకుని అమంగళకర విస్మయ

దృక్కులు తన్ను వెనుకనించి పొడుస్తున్నట్టుగానే అనుభ వించింది.

"ఇల్లంతా ఎలావుందో చూచావా నాన్నా !"

"ఏం, బాగానే వుందిగా !" విస్మయ సూచకంగా అన్నాడు రే.

ఆలేఖ్య పెదవి కొరిచింది. "నీ చూపులకు బాగానే ఉంటుంది. కాని హాల్లో గోడలకు రంగులేయిస్తే తప్ప అక్కడ కూచోటానికి వీల్లేదు. భోజనశాలలోకూడా మళ్ళీ రంగు పూయిస్తేతప్ప అక్కడ కూచుని భోజనాలు చెయ్యలేం. ఇన్నాళ్ళనుంచీ నీ నౌకర్లంతా ఏం చేస్తున్నట్టు? ఒక్కొక్క డినీ పిల్చి కనుక్కోవల్సిందే. ఈ పాత నౌకర్లవల్ల లాభంలేదు. అంతా కంగాళీ చేసిపెట్టారు."

ఔనన్నట్టుగానే తలవూపుతూ రేగారు వెల్లిగా "నువ్వు చెప్పినమాటలు నిజమే. కాని చాలరోజులనుంచీ ఇల్లు ఖాళీగాఉండె. ఇన్నాళ్ళు ఎవరూ కాపురంలేకుండా వుంటే ఇల్లు శుభ్రంగా ఎలావుంటుందీ ?"

"అదంతా వేరేసంగతి. నౌకర్ల సోమరితనంవల్లనే ఇలా పాడైపోయింది. మేనేజరు, నౌకర్లు — అంతా నిద్రపోతున్నా రన్నమాట. తప్పు అందరిమీదా వుంది. అందర్నీ శిక్షిస్తాను. నువ్వుమాత్రం అడ్డంరాకు."

రే నవ్వాడు. "నేనెందుకు అడ్డం వస్తానమ్మా. ఈసమ సం నీది. వీళ్ళందర్నీ నీ ఆజ్ఞాబద్ధుల్ని చేసుకుంటానంటే నాకేం అభ్యంతరం? నీ యిష్టం వచ్చినట్టు చేసుకో. నువ్వు ఎవ రికీ ఏ విధమైన అన్యాయం చెయ్యలేవని నాకు బాగా తెలుసు"

అమ్మాయిముఖం చేటంత అయింది. "ఫర్నిచర్ అంతా పనికిరాకుండా వుంది. పాతవన్నీ ఇచ్చేసి, కొత్తవి కొంటారు. నాలుగైదు వేలుకావాలి.

రే అనుమానిస్తూ "అబ్బో అంతఖర్చే?" అని పలి కాదు అయినా నువ్వు ఈ అడవి దేశంలో ఉండలేవు. ఏదో రెండు రోజులు ఉండిపోవటానికి వచ్చాం. ఇంతఖర్చుచేసి అన్నీ అమర్చి మనదారిని మనం వెళ్ళిపోతే మళ్ళీ మామూలే ఔతుంది ఏం లాభం?"

"అలా కాదు" అన్నట్టుగా ఆలేఖ్య తల ఊపింది. ఇక్కడ ఉండిపోవటానికే నిశ్చయించుకున్నాను నాన్నా. అలా కాకపోయినా సంవత్సరానికి రెండుసార్లు తప్పకుండా ఇక్క డికి రావాల్సిందే. మనం కనిపెట్టి ఉండకపోతే మాత్రం ఇక్క డంతా సర్వనాశనం చేసేస్తారు- నాకు తెలుసు."

తండ్రిముఖంలో ప్రసన్నత వెల్లివిరిసింది. "అమ్మాయీ! ఇన్నాళ్ళకు నీకీసంగతి తెలిసివచ్చిందంటే అంతకన్నా ఆనంద కరమైన విషయం నాకింకేముంది?" అంటూ రేగారు అధ్యా పకుని వైపుతిరిగి "ఔను. కాదూ అమరనాథ్ బాబూ! ఇన్నా ళ్ళకు అమ్మాయి అసలైన కిటుకు తెలుసుకుందీ అంటే సంతోషంకాదూ!"

అమరనాథ్ ఔననిగాని కాదనిగాని ఏమీ బదులు పలక లేదు. ఆలేఖ్యానవ్వుతూ "అది తెలుసుకోటానికి ఇన్నాళ్ళు పట్టిందినాకుకాదు నాన్నా, నీకే. పది పన్నెండేళ్ళక్రితమే నీకీ విషయం తెలిసివుంటే ఈ నాడీకొత్తయేర్పాట్లన్నీ చెయ్యా ల్సిన అవసరం నాకు ఉండేది కాదు," అన్నది.

కూతురు మాటలకు విరుద్ధంగా తండ్రి ఏమీ చెప్పలేదు. కాని ముఖవైఖరిలో ఉద్విగ్నత గోచరించింది. "సరే తొందరేమొచ్చింది. తీరిగ్గా అన్నిపనులూ చేయిద్దాంలే.

"ఉహుం. అలాకాదు నాన్నా" అంటూ ఆలేఖ్య ఒక ఉత్తరం - తన చేతిలోని ఇంగ్లీషు నవలలోనుంచి తీసి తండ్రి చేతికిచ్చింది జేబులోనుంచి కళ్ళజోడుతీసి పెట్టుకుని దాన్ని రెండుమూడుసార్లు చూసి మళ్ళీ కూతురికిచ్చేశాడు. "అలాగా! చెల్లెల్ని తీసుకుని కమలకిరణ్ కలకత్తా వస్తున్నాడు. ఘోష్ గారుకూడా రావచ్చు సరేలే అమ్మా! మనింటికి ఎప్పుడొచ్చేదీ రాశారా ఏమైనా?"

"కలకత్తా వచ్చాక రాస్తారేమో"

రే కళ్ళజోడు తీసి జేబులో పెట్టుకున్నాడు. బట్టతల వెన్నెల్లాగ మెరిసింది. తండ్రిగారి ఆర్థిక దురవస్థ ఎట్టిదో ఆలేఖ్యకు బాగా తెలియదు. అయినా కొన్నాళ్ళనుంచీ ఆమెకు ఆ విషయమై సందేహంగానే వుంది.

"అయితే ఎంతడబ్బు కావాలంటావు ఆలో! చాల ఎక్కువే..." రే తనంతట తానే ప్రస్తావన తెచ్చి అడిగాడు.

ఆలేఖ్య తనలోతానే అంచనా వేసుకుంది. "సరిగ్గా ఎంతకావాలో చెప్పలేను. పడుకోటానికి నాలుగైదు మంచాలు కావాలి. నాలుగు డ్రెసింగ్ టేబిల్సు కావాలి. ఈజీచైర్సు ఒక పదివుండాలి..."

"పదికావాలా?" రే అనుమానంగా పలికి అధ్యాపకునివైపు తిరిగి "అమరనాథ్! మీ బీద విద్యార్థులకు నేనేమీ సహాయం చెయ్యజాలనేమోనని విచారిస్తున్నాను" అన్నాడు.

"చిత్రం. నాకూ అలాగే కనిపిస్తున్నది" అన్నాడు. అమరనాథ్ మందహాసం చేసి.

ఆలేఖ్యకు ఒళ్ళు మండిపోయింది. వీడికేమన్నా మర్యాద తెలుసా? తాము ఇంటివ్యవహారాలు మాట్లాడుకుంటూవుంటే—ముక్కు మొగం ఎరగని వ్యక్తి వెంటనేలేచి వెళ్ళిపోవద్దూ! పోనీ వెళ్ళిపోకుండా కూచున్నవాడు అలాగే నోరుమూసుకొని కూచోవద్దూ? తమ స్థితి గతులను గూర్చిన విచారణ వాడి కెందుకూ? పైగా వ్యంగ్య వాక్యాలు విసురుతాడా? ఆమాట ఆలేఖ్య చెవుల్లో సూదిలా గుచ్చుకుంది. అంతకోపం వచ్చినా కూడా, చిన్నతనంనుంచీ సుశిక్షితుగాలు కావటంచేత, పైకి పొంగలేక పైకి నవ్వుతూనే "ఔను నాన్నామరి! అంత మాత్రం లేకపోతే ఎలాగ? అదిగాక ఇంకా పరుపులు కొత్తవి కుట్టించాలి. ఒక కార్పెట్ కొనాలి. టీ సెట్టు డిన్నరుసెట్టు కొనాలి...మూడునాలుగు వేలు కావలిసిందే. ఇంకా ఎక్కువే కావచ్చు" అన్నది.

రే ఒకనిట్టూర్పు విడిచాడు: "ఔను. అంతా కావల సిందే అమ్మా!"

అంతపెద్ద నిట్టూర్పు విన్నతర్వాత ఆలేఖ్య నవ్వలేక పోయింది. బలవంతాన నవ్వు తెచ్చుకుని అన్నది. "సంఘాన్ని బట్టే మనపద్ధతి. వాళ్ళను మరి రాజోచిత ఉదార భారతీయ పద్ధతిలో మట్టిపాత్రలతో, మోదుగాకు విస్తర్లతో సత్క రిస్తామా? ఈజీచెయిర్కు బదులుగా దర్భాసనం వేస్తే అతిథి పూజ జరిగినట్టేనా? ఎలామరి!"

"ఔనౌను. అంతా సవ్యంగా జరగాల్సిందే. ఉపాయాంతరం లేనప్పుడు అలాగే కానిద్దాం. నువ్వు ఒక జాబితా తయారు చెయ్యమ్మా!"

"అంతా నేనే చేస్తాను నాన్నా! నువ్వేమీ కష్టపడనక్కరలేదు."

రే జవాబు చెప్పలేదు. కూతురు మళ్ళీ అందుకుని ఇలా చెప్పింది "ని చేత నేను ఒక్క పనీ చేయించను. చెయ్యాల్సిన పనులన్నీ నేనే స్వయంగా చేస్తాను. ఈ ఖర్చంతా ఎలా వస్తుందో తెలుసా? ఏం ప్రయాస పడనక్కర్లేదు. ఇంతమంది నౌకర్లెందుకూ! చూడరు, వినిపించుకోరు. నలుగురూ అయిదుగురూ కాదు. ఇరవై ముప్పయిమంది ఊరికే కూచుని తినేస్తున్నారు. ఇలా వీళ్ళంతా మనకళ్ళలో దుమ్ముకొట్టి ఎన్నాళ్ళు కాలక్షేపం చేస్తారు. అందర్నీ బర్తరఫ్ చేస్తాను. మంచివాళ్ళను మాత్రం అట్టెపెడతాను. సగంమందిని మాత్రమే ఉంచి డబల్ పని చేయిస్తాను. గుళ్ళు గోపురాలు చూడు ఎన్ని వున్నాయో వాటిమీద ఎంతో డబ్బు వృధా అయిపోతున్నది. వీటని కూడా మూసేయించి పది పన్నెండు వేలు ఆదా చేస్తాను."

వృద్ధ జమీందారు రానున్న అతిథులను గురించి ఆలోచిస్తూ కూతురు మాటల్ని అంతగా వినిపించుకోలేదు. కాని ఆమె చివరివాక్యం చెవిని పడగానే అతడు ఉలికిపడ్డాడు. "ఎలా ఆదా చేస్తావు. తల్లీ! దేవాలయాదాయమా! మనకీ సంపత్తి ఇచ్చిన దేవతల ఆరాధనకోసం మన పూర్వులు ఆ ఖర్చును మంజూరు చేశారు. ఆ డబ్బును నువ్వు ఎలా ముట్టుకుంటావు?"

"అలా మర్యాయం చేసిన ఆ పూర్వరాజులమీదే రుద్దుతున్నాను నాన్నా! నువ్వేమీ దేవాలయాల్ని కట్టించ లేదు. దేవతల్ని ప్రతిష్ఠించలేదు. పొరపాటుగాని, తప్పుగాని ఎవరు చేసినా దాన్ని అక్కడే అంతం చెయ్యాలిగాని కొనసాగిస్తూ వుంటామా? మా అమ్మకూడా ఈ ఆలయాల్ని బందు చెయ్యమనే పోరుతూవుండేది. జ్ఞాపకంలేదూ?"

రే మాట పలుకులేకుండా నిర్నిమేషంగా కూతురు ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు. ఆశ్చర్యపూర్ణములైన ఆయనచూపులకామె లజ్జాన్విత అయింది. "ఈ విగ్రహారాధనలో నీకు విశ్వాసం వుందా నాన్నా!"

"నా విశ్వాసాన్నిగాని, అవిశ్వాసాన్నిగాని పురస్కరించుకుని ఈ దేవతా విగ్రహాలు వెలిశాయా తల్లీ!"

"మరి ఈ విగ్రహారాధనఖర్చు నువ్వెందుకు భరించాలి?"

"నేనెందుకు భరిస్తున్నాను. వాటిని ప్రతిష్ఠించిన మా నాన్న, తాత... వాళ్లే భరించారు. ఇప్పటికీ భరిస్తున్నారు. ఆ దేవతా విగ్రహాలమీద నీకు విశ్వాసం లేకపోవచ్చు. కాని నువు వాటిని వెలాసంచేయటం నేను సహించను".

ఆయన మనో దౌర్బల్యానికి చిహ్నమైన ఆ మాటకు సరైన సమాధానం చెప్పబోయింది ఆలేఖ్య. కాని వెంటనే ఆశ్చర్యపోయి ఆ సమాధానం మరచిపోయింది. ఇంతవరకూ మౌనంగా కూచున్న అధ్యాపకుడు హఠాత్తుగా వంగి రేగారి పాదధూళి గ్రహించి తన శిరస్సుపై వుంచుకున్నాడు.

"అదేమిపని అమరబాబూ!"

"ఏమీలేదు రాయ్ మహాశయా! ఇంతవరకూ మీకు ప్రణామం చెయ్యని పొరపాటును సవరించుకున్నాను" అన్నాడు అమరనాథ్ సవినయంగా.

"పొరపాటేముంది? నేను బ్రాహ్మణుడినే కాదన్న నావంటివాడికి మీరు ఎందుకు ప్రణామం చెయ్యాలి?"

"అదంతా మీకు తెలియాలి. నేనుమాత్రం నా కర్తవ్యాన్ని నెరవేర్చాను. తెలియక మానవులు ఎన్నెన్నో అనేక రకాల పొరపాట్లు చేస్తూవుంటారు."

ఆ మాటల భావార్థం వృద్ధునికి అర్థంకాలేదు అమరనాథబాబూ! అజ్ఞానానికి హద్దు వుందా? కాని నువు నాకు ప్రణామం చెయ్యకపోవటం మాత్రం పొరపాటనిపించుకోదు. నేను మీవంటివారి ప్రణామములకు అర్హుణ్ణికాను."

అమరనాథ్ మరేమీ మాటాడలేదు.

ఆలేఖ్య మాట్లాడకుండా వుండలేకపోయింది. మధ్యలో కల్పించుకుని మాట్లాడ్డం ఆమె దృష్టిలో సభ్యతకాదు. అది ఆమె స్వభావమూకాదు. కుదట కలిగిన ఆశ్చర్యం క్రోధంగా పరిణమించింది. ఆ క్రోధావేశం దుస్సహమనిపించింది. అన్నది: "ఇక నువ్వీయనగారి బీదవిద్యార్థులకు తప్పకుండా సాయం చెయ్యాల్సిందే నాన్నా!"

ముసలితండ్రికీ వ్యంగ్యం స్ఫురించలేదు. లోపల సంకోచిస్తూనే అన్నాడు: "సహాయం చెయ్యటమే కర్తవ్యం మరి! కాని మనం ఇప్పుడు సహాయంచేసే స్థితిలోనే ఉన్నామా?"

"సహాయం చెయ్యాల్సివస్తే గుప్తంగా చేసెయ్యటమే దైవభక్తి బ్రాహ్మణభక్తి నీ మాటల్లో కనిపింప జేయటం పెద్ద ఇకట్టు"

"ఇక్కట్లా ?" సంకోచిస్తూ అన్నాడు తండ్రి.

అధ్యాపకుడు పకపక విరగబడ నవ్వసాగాడు. "ఇందులో ఇక్కట్లేముంది ? మీకేం భయం లేదు. డ్రెసింగ్ టేబిల్, చమ్చాలు, డిష్‌లు వీటన్నిటిచాటునా అంతా మాటుమణిగి పోగలదు"

ఒక వంగ్యవాక్యంతో అతన్ని దెబ్బకొట్టాను కనకనా అన్న భావంలో సంతృప్తి పొందుతూన్న ఆమె మనస్సు అతని పరిహాసవాక్యానికి మరింత క్రౌర్యం తాల్చింది. వెనుకముందు చూడకుండా అనేసింది ! "మాటుమణిగిపోతుంది సరే, పాద రక్షల ధూళివిలువకూడా మీకు ఇచ్చుకోవద్దూ !"

మాటైతేపైకి అనేసిందిగాని వెంటనే తనకుతాను సిగ్గు పడిపోయింది. అటువంటిమాట తన నోటివెంట ఎలా వచ్చిందో తనకే అర్థంకాలేదు. రే మిక్కిలి ఆశ్చర్యపడుతూ కూతురుకేసి చూస్తున్నాడు. ఎంత అమాయకుడైనా కూతురు ఆ గంతుకుని పైవిడిచిన బాణాన్ని చూడకపోలేదు. ఇంతలో ఒక నౌకరు వచ్చి ఎవరో కొందరు సజ్జనులువచ్చి బైటగదిలో చాలసేపటి నించీ వేచివున్నారని చెప్పాడు.

"వస్తున్నా పద" అని రే నౌకర్ని పంపించేశాడు. కూతురుకేసితిరిగి "నువు చాలపొరపాటుమాట పలికావమ్మా!" అన్నాడు. మళ్ళీ అమరనాథ్‌వైపు తిరిగి "మీరు వెళ్ళకండి నేనిప్పుడే వస్తాను" అని చెప్పి బైటికి వెళ్ళాడు.

ఆలేఖ్య తండ్రితోకూడా వెళ్ళలేకపోయింది. అక్కడే కూచుంది. గడచిన దానికి సిగ్గుపడుతూ మెల్లిగా అన్నది.

మీతో నాకు పరిచయంలేదు. నేను చూపిన అసభ్యతకు విచారపడుతున్నాను. నేనలా మాట్లాడ్డం ఉచితం కాదు."

"ఔను ఉచితం కాదు."

ఈ వాక్యంకూడా ఆలేఖ్యను రుచించలేదు. "తండ్రిగారిని ఇతరులు గౌరవించటం కూతురుకు సంతోషదాయకం. మా నాన్నా చాలమంచివాడు. ఆయన్ను మీరు మోసగించటం ఉచితం కాదు."

అమరనాథ్ చకితుడైనాడు.

"మోసమా ? ఏం మోసం ?"

"ఆయన పాదధూళి తీసుకుని మీరు శిరసున వేసుకోటం ఆడంబరంగాక ఉచితమైన పనేనా ?"

"ఉచితమైన పనే అది"

"అలాగైతే ఇక నేను అంగీకరిస్తున్నాను."

ఆలేఖ్యలేచి వెడుతూ హఠాత్తుగా ఆగింది. "మీకు ఒకటి మాటచెప్పాలి. మానాన్నగారి మానసిక దౌర్బల్యాన్ని చూచి మీరు విసుగుపడటం సహజం. మతవిషయికమైన అభిప్రాయాలు భిన్నంగా ఉండి దేవతలన్నా బ్రాహ్మణులన్నా ఏమాత్రం గౌరవంలేని వాళ్ళు ఈవిధంగా అసత్యాల్ని పట్టుకుని ఊగులాడుతూ ఉన్నారని అదిమీరు అనుచితంగా భావించకండి సుమీ !"

అధ్యాపకుడు తల అడ్డంగా ఊపాడు. "ఎన్నటికీ భావించను. ఆయన నీమీది మమతలోపడిపోయి నువ్వు చెప్పిందానికల్లా ఊకొడుతూ ఉంటే అది అన్యాయమూ అనుచితమూ ఔతుంది. ఆయనగారి అవిశ్వాసము ఆయన కర్తవ్యానింతా, అన్యాయమూ ఔతుంది"

అధ్యాపకునిమాట గంభీరంగా ఉంది. ఆలేఖ్యకను బొమలు కుంచుకుపోయాయి. "మావిశ్వాసాలు ఎటువంటి వైనాసరే పూర్వంనించీవస్తున్న సాంప్రదాయాలూ, ఆచారాలూ అలా సాగిపోతూఉండాలనేగా మీ అభిప్రాయం?"

అధ్యాపకుడు నవ్వాడు. సాధారణంగా పాశ్చాత్య వ్యామోహ జనం పలికేమాటే పలికావు. మీవిశ్వాసాలే ఉచితములన్న అహంభావం తప్పితే మీకేమీ తెలియదు. అలా మాట్లాడినందువల్ల ప్రయోజనమేమీలేదు. చాల నష్టం ఉంది. పోనీలే గుడులలో దేవతావిగ్రహాలు సత్యములో, కాదో! అవి మాట్లాడతాయా పెడతాయా? భోగనైవేద్యాలు బందుచేస్తే అవి అభూయిత్యం చెయ్యవు. కాని విదేశాలనించి ఎంతో ఖర్చుపెట్టి అద్దాలు, పళ్ళాలు, బట్టలు నవీనవస్తుసంచయాన్ని కొనే ప్రబుద్ధులను ఆక్షేపించే వాళ్ళు మాత్రం "ఊరుకోరు. బిగ్గరగా ప్రబోధం చేస్తారు. అడ్డగిస్తారు. విదేశవస్తువులు కొనటం మాత్రం నువ్వు ఎప్పుడూ చెయ్యకు"

ఈమాటలు చాల నీచమైనవిగా వినిపించాయి ఆలేఖ్యకు. ఆపలుకులద్వారా అతడు తన్ను తిరస్కరించినట్టయింది. ఆమెకు కోపంవచ్చింది. విస్మిత దృష్టితో అతనికేసి అలాగే చూచింది. చేత్తోకుట్టిన ముతకపోకా తొడుక్కున్నాడు. ఉత్తరీయంకూడా ముతకదే. కాళ్ళకు చెప్పులు లేవు. అదంతా చూచి ఆలేఖ్య కఠినస్వరాన ఇలా అన్నది: "మీకు సహాయనిరాకరణోద్యమంతో సంబంధం లేదు కద!"

"ఉన్నది"

"ఇక్కడ వటుకదేవ్ అనే వ్యక్తిట ఎవరు? మీకు తెలుసా?"

"తెలుసు. అది నాపేరే"

"అలాగా? అయితే అంతా తెలిసిందిలెండి. మీరు మమ్మల్ని విదేశీవస్తువుల్ని కొనకండా అడ్డగిస్తారన్నమాట?"

"తప్పకుండా"

"మాకు రైతులు శిస్తులివ్వకుండా ప్రోత్సహిస్తారన్నమాట!"

"ఔను. వాళ్ళకు పాపం ఎంతకష్టపడితే రూపాయి చేతిలో పడుతోంది?"

"మేము విదేశీవస్తువులుకొంటే మీరు దౌర్జన్యంగా స్వాధీనంచేసుకుని తగలబెట్టేస్తారా?"

"దౌర్జన్యం ఎందుకు చేస్తాం" మిమ్మల్ని అసలు కొనకుండానే చేస్తాం"

ఆలేఖ్య చాలసేపు నిస్తబ్ధయై నిల్చుంది. బలవంతాన కోపాన్ని అణచుకుంది. చివరకు శాంతస్వరాన ఇలా అన్నది. "చూడండి. అమరనాథబాబూ! మానాన్నగారు మెత్తని మనిషి. నేను అలాంటిదాన్ని కాదు సుమండీ! అందుచేతనే నేనుకూడా ఈవూరు వచ్చాను. మీరు చేసే ఈఆందోళన సక్రమమైందో కాదో నాకు తెలియదు. సక్రమమైందే కావచ్చు కాని మీరు మీఆందోళన మా ఎస్టేటుకు మారైతులకు మా గ్రామములకు మాకు దూరంగా ఉండవలసిందే. పోలీసుల్ని పిలిపించటం నాకిష్టంలేదు. మనదేశీయుల్ని పోలీసులచేత దండింపించటం నామనస్సుకు చాల కష్టంగా ఉంటుంది. మీ

చేతులకు కాళ్ళకూ సంకెళ్ళు తగిలించటంకంటే గత్యంతరంలేని పరిస్థితుల్ని కల్పించబోకండి......"

అంతమాత్రం పలికి మరి ప్రత్యుత్తరం ఆపేక్షించకుండానే ఆలేఖ్య దృఢంగా వెళ్ళిపోతోంది.

"అంటే మీరు న్యాయం ఆలోచించదలచలేదన్న మాట!" అన్నాడు అమరనాథ్ బిగ్గరగా.

ఆలేఖ్య గుమ్మం దగ్గర ఆగింది. "న్యాయాన్యాయాల విషయమై మీ భావాలకూ మా భావాలకూ తేడా ఉంది" అని పలికి ఆలేఖ్య వెళ్ళిపోయింది అమరనాథ్ ఆమె వెళ్ళిన ద్వారంవైపు ఆశ్చర్యంగా చూస్తూ కూచున్నాడు.

## 3

కహాతురు ఎస్టేటువ్యవహారాలు చక్కబెట్టటానికి పూనుకోటం రేగారికి ఆనందం కలిగించింది.

ఇల్లు బూజుదులిపించటం, గోడలకు రంగులు పూయించటం, వస్తుసామాగ్రి యథాస్థానాల్లో అమర్చటం ఇత్యాది పనులన్నీ ఆరంభమైనవి. మరోకవంక ఎస్టేటు వ్యవహారాలు కూడా సాగుతోన్నవి. ప్రతిరోజూ ఎవరో ఒకరు పోట్లాటలూ, పేచీలూ ఫైసలా చేసుకోటానికి వస్తూనే ఉన్నారు. ఇవన్నీ సక్రమంగా నిర్వహించాల్సిన బాధ్యత కూడా ఆలేఖ్య తానే నెత్తిమీద వేసుకుంది ఇందుకు ఆమెలో ఎంతో ఓర్పుదాగి వుండాలి. రిటైర్డు మేజిస్ట్రేటు మేనేజరుగా పని చేస్తున్నాడు. అతడు కూడా ఆమె యోగ్యతను అంగీకరించాడు. ఉదయం నించి సాయంత్రం వరకూ మేనేజరుకు ఊపిరి పీల్చుకోటానికి తీరిక చిక్కటంలేదు. ఆలేఖ్య అతనిదగ్గర కూచుని ఖాతాపుస్త

కాంబు తీయిస్తుంది. ఏయే గ్రామంనించి ఎంతెంత ఆదాయం వస్తున్నదో అడుగుతుంది. ఎక్కడెక్కడ ఎవరెవరు ఏయే పనులు నిర్వహిస్తున్నదీ అవగాహన చేసుకుంటుంది. అనేక సమస్యల్ని గురించి మేనేజరుతో చర్చిస్తుంది. మేనేజరుకు చెమటపోసే వరకూ తర్కిస్తూనే వుంటుంది. ఏ నౌకరు డ్యూటీ యేమిటి? బాగా పనిచేయగలిగినవాడికి ఎంత జీతం ఇవ్వచ్చు? ఈ మొదలైన విషయాలన్నీ ఆమె తెలుసుకుంది. వయసుమళ్లిన కొందరు నౌకర్లమీద ఆమె చూపు ఎప్పుడో పడింది. క్రాసుచేసి అడిగినమీదట మేనేజరు ఒప్పుకున్నాడు. 'వాళ్ళవల్ల జీతం నష్టమే తప్ప ప్రయోజనం ఏమీ లేదనీ, ఆ సంగతి ఎప్పుడో శే గారికి తెలియచేసినా వారేమీ చర్యతీసుకోలేదనీ. పనిచేసి చేసి వాళ్లు ముసలివారైనారనీ, బలవంతాన వాళ్ళచేత ఇప్పుడు పనిచేయించవలసిన అవసరం లేదనీ క్రొత్తగా పెట్టుకున్న నౌకర్లచేత అన్నిపనులూ అవుతాయనీ శేగారి అభిప్రాయం అయినట్టుకూడా మేనేజరు చెప్పాడు. అందువల్లనే వాళ్ళను వెళ్ళగొట్టలేదు.

"అందువల్లనే నాన్నగారి ఖర్చులకు అంతంలేకుండా వుంది" అన్నది ఆలేఖ్య.

మేనేజరు వ్రజబాబు ఏమీ మాట్లాడలేదు.

"ఇలాగైతే లాభంలేదు. పనిలేని నౌకర్లకు ఈ నిత్యాన్నదానం సాగటానికి వీల్లేదు" అన్నది ఆలేఖ్య.

"మీ యిష్టప్రకారమే కానీయండి."

రెండుమూడు రోజులు గడిచాయి. పాతస్నేహితులను చూచివద్దామని శే కలకత్తా వెళ్ళాడు. ఒకరోజున ఆలేఖ్య

మేనేజరును పిలిపించి, అతనిచేతికొక జాబితా ఇచ్చింది. "వాళ్ళందరికీ ఒక నెలజీతం ఉచితంగా ఇవ్వండి. పనిలోనించి వెళ్ళిపొమ్మని చెప్పేయండి. నాన్నగారి మనస్సు మిక్కిలి దుర్బలమైంది. ఈ సమాచారమంతా ఆయనకు చెప్పవలసిన అవసరంలేదు.

వొణుకుతూన్న చేతులతో వ్రజబాబు జాబితా అందు కున్నాడు. కళ్ళజోడు పెట్టుకుని పేర్లన్నీ వరుసగా చదివాడు. అతని గొంతు ఎండిపోయింది. అన్నాడు "సరే, మీ యిష్టం కాని ఈ నయనగంగూలీ చాల బీదవాడు. పాపం—"

"బీదవాళ్ళకు ప్రపంచంలో వేరే యేర్పాట్లుఉన్నాయి"

"ఉన్నాయి. కాని..."

అర్ధోక్తిలోనే ఆలేఖ్య అడ్డువచ్చింది. "చూడండి మేనే జరుగారూ! ఎక్కువగా చర్చలకు దిగటం నా కిష్టంలేదు. బాగా ఆలోచించే నేనీ జాబితా తయారుచేశాను. ఇక మీరు వెళ్ళవచ్చు."

"చిత్తం" అంటూ మేనేజరు జాబితాను గుప్పెట్లో పెట్టుకొని వెళ్ళిపోయాడు.

చదువుకున్న ఆడపిల్ల అధికారంలోకి వస్తే వ్యవహారం ఎలా వుంటుందో మేనేజరుకు ఇప్పుడు బాగా అర్థం అయింది. ఆమెతో కాదు-కూడదని వాదించే దమ్ములు లేవాయనకు. తన పేరుకూడా ముసలివాళ్ళ లిస్టులోగాని, సోమరిపోతుల జాబితాలోగాని చేరుతుందేమో నని కాదు ఆయన భయం. ఇప్పుడీ ఉద్యోగంలోనించి తీసివేయబడుతూన్న వాళ్ళంతా ఊరుకోరు. ఆవేదన పడతారు, వచ్చి మళ్ళీ కాళ్ళమీదపడతారు,

సిఫార్సులు తెచ్చుకుంటారు; చెయ్యాల్సిన హంగామా అంతా చేస్తారు.

అలాగే అయింది. ఆ మర్నాడే నాలుగు దరఖాస్తులు వచ్చాయి. వాటిని మేనేజరు ఆలేఖ్యకు పంపించాడు. దరఖాస్తులలో బంగాళీదేశదారిద్ర్యగాథ, అందుకు కారణాలు ఉల్లేఖితములైనాయి. తమ తమ కుటుంబాల్లోని అనాథల సంఖ్యను పేర్కొంటూ, రేగారి సంస్థానంలో తప్ప మరెక్కడా తమకు నిలవనీడ దొరకదని విలపించారు.

అంతమాత్రానికే ఆలేఖ్య మెత్తపడే మనిషి కాదు. ప్రతి అర్జీమీద ఆమె ప్రస్ఫుటంగా రాసింది: 'తానేమీ సహాయం చెయ్యజాల'నని ఆమాటే మేనేజరు వాళ్ళకు జారీచేశాడు. అందర్నీ ఒకచోట చేర్చి "దొరగారు కలకత్తానుంచి వచ్చేవరకూ మీరు వేచివుండండి మీ కన్నీళ్ళవిలువ ఆ ముసలాయనకే తెలియాలి తెలిస్తే" అన్నాడు.

మరి నాలుగురోజుల తరువాత ఒకనాటి ఉదయం ఆలేఖ్య పంచపాళీలో కూర్చుని కొన్ని పటాలు పరిశీలిస్తూవుంది పెయింటింగు డిజైనులు కొన్ని భోజనశాలకు తగిలించేందుకు తెప్పించింది. వాటిలో రెండు బాగున్నవి ఎన్నుకుని ఇడిగా పెట్టింది. ఇంతలో ఒక ముసలి మనిషివచ్చాడు. చాల సుస్తీగా ఉన్నాడతడు. చినిగిన మాసిన బట్టలు ధరించాడు. చొక్కా నిండా మరకలే.

"ఎవరు నువ్వు?" ఆలేఖ్య చూడ్డంతోనే అడిగింది.

అతడు నత్తిగల వెంటనే జవాబు చెప్పలేకపోయాడు.

"నేను నయన గంగూలీని" అన్నాడు చివరకు.

ఆలేఖ్య అతన్ని గుర్తుపట్టింది. "ఎందుకొచ్చావు?" అని కఠినంగా ప్రశ్నించింది.

జవాబు చెప్పటానికి ప్రయత్నించటంలో అతని పెదవులు, కళ్ళు రకరకాలుగా తిరిగాయి. చివరకు ఇలా చెప్పాడు. "నాకూతురు పేరుదుర్గ. ఆమె నన్ను మీదగ్గరకి వెళ్ళి బ్రతిమాలమంది. మీరు తప్పకుండా నౌకరీ ఇస్తారని చెప్పింది. నాకు ఒకదౌహిత్రుడున్నాడు వాడు మంచి బుద్ధిమంతుడు.

ఆ సుస్తీముఖాన్ని, వాడి మాసిన దుస్తుల్ని చూస్తుంటే ఆలేఖ్యకు అసహ్యం పుట్టుకొచ్చింది. దివాణంలో పనిచెయ్యకుండా భోజనం మాత్రం చేస్తున్న నౌకర్లందరిలోకీ అగ్రస్థానం అతనిదే. అందరికన్నా ముసలి, దుర్బలుడు అతడే. పెయింటింగే డిజైనుల మీదినించి దృష్టి మరల్చకుండానే చెప్పేసింది: "నేనేమీ సహాయం చేసేది లేదు. నువు బైటకి వెళ్ళిపో బాబూ!"

ముసలివాడు కదల్లేదు. మొద్దులా అలాగే నిల్చున్నాడు. తన కథ, కమామీసు అంతా ఆరంభించాడు. "ఈ ముప్ఫయి రూపాయల నౌకరీతప్ప నాకు ప్రపంచంలో మరో ఆధారం లేదు. భార్య ఎప్పుడో చచ్చిపోయింది అయిదేళ్ళ క్రితం కొడుకు పోయాడు. అల్లుడు నౌకరీ వెతుక్కోటానికి అస్సాం వెళ్ళాడు. అక్కడ సన్యాసం పుచ్చుకున్నాట్ట. తరువాత ఇంత వరకూ అతని సమాచారమే తెలియదు.

ఆలేఖ్య విసుగుదల చూపింది. "నీ యింటి వ్యవహారాలన్నీ వింటూ కూర్చోటానికి నాకు తీరికాలేదు, కోరికాలేదు. ఇక నువ్వు దయచెయ్యి బాబూ!"

గంగూలీ ఆమాట వినిపించుకున్నాడో లేదో! తన గోడవేదో వాగుతూనే వున్నాడు. ఆలేఖ్య నౌకర్ని పిలిచి, అతన్ని బైటికి నెట్టేయించింది. తరువాత తీరిగ్గా తన పని చూసుకుంటూ కూచుంది.

కలకత్తానుంచి ఏవేవో సామానులు వస్తూనే వున్నవి. మన్నాటి ఉదయం ఒక పెద్ద అద్దం ఒకటి తన పడకగదిలో అమర్చుతూవుంది ఆలేఖ్య. ఆ సమయాన పదేళ్ళ ఒక పేద కుర్రాణ్ణి వెంటబెట్టుకుని మేనేజరు అక్కడికి వచ్చాడు. కుర్ర వాడి వొంటిమీద చొక్కా లేదు. ఒక చిన్న అంగవస్త్రం మొలకు చుట్టుకున్నాడు. ఏడ్చియేడ్చి కళ్లు ఎర్రబడిపోయాయి. ఆలేఖ్య ఆశ్చర్యాన్వితయై అతనివైపు చూస్తూవుంది.

"అసమయంలో మీ దర్శనానికి రావలసి వచ్చింది. గత్యంతరంలేక..." అంటూ ఆరంభించాడు వ్రజబాబు.

"అంత అత్యవసరమైన పనా?" ఆలేఖ్య అడిగింది. తానేదైనా పనిలో వున్నప్పుడు ఎవరైనా ఇలా వస్తే ఆమెకు కష్టంగానే వుంటుంది. అదీగాక ఘోష్‌బాబు మొదలైనవా రంతా రానున్నారు. ఇంకా ఇంట్లో బోలెడన్ని యేర్పాట్లు చెయ్యాల్సి వుంది.

"నయనగంగూలీకి ప్రతినెలా అయిదేసిరూపాయలు జీతం గాక ధర్మార్థంగా యిస్తున్నాం. ఆ సంగతి మీకు చెపితే తరువాత ఆలోచిస్తామని చెప్పారు."

"అది యిప్పుడంత అవసరమని నాకు తోచటంలేదు."

ఆ మాట విన్న తరువాత మరేమి మాట్లాడ్డానికీ వ్రజ బాబుకు ధైర్యం లేకపోయింది. కుర్రవాణ్ణి తీసుకుని తిరుగు

ముఖమైనాడు. ఆలేఖ్యకు కుతూహలం కలిగింది. "ఆ కుర్రవా డెవరు మేనేజరు బాబూ! గంగూలీ దౌహిత్రుడా?" అని అడిగింది.

కుఱ్ఱవాడు స్వయంగానే 'ఔను' అని చెప్పి ఏడవటం మొదలుపెట్టాడు. వ్రజబాబు మెల్లిగా సమాచారం వెళ్ళ బెట్టాడు. "నిన్న చిల్లరదుకాణాదారు గంగూలీకి బియ్యంగాని, పప్పుగాని ఇవ్వననేశాడు. అతన్ని పనిలోనుంచి తీసివేసినట్లు వర్తకుడికి నిన్ననే తెలిసిపోయిందికామాలు. గంగూలీకి అతనికి బాకీవుండటం-లో ఆశ్చర్యంలేదు. పొయ్యిలో పిల్లి లేవలేదు. నిన్న ఇంటిల్లి పాదీ పస్తు. కొడుకుచావు – అల్లుడు పారిపోవటం, మనస్సు అసలే పాడైపోయివున్న అతడు గన్నేరుకాయ నూరి తాగేశాడు; ఆత్మహత్య చేసుకున్నాడు. పోలీసులువచ్చి అనుజ్ఞ ఇస్తేనేగాని దహన సంస్కారాలు జరగవు."

ఆలేఖ్య తత్తరపడిపోయింది. "ఆత్మహత్యా? ఎవరు?"

"మా తాతే" అంటూ ఏడుస్తూ కుర్రవాడు జవాబు చెప్పాడు.

"తాతా? నయనగంగూలీ? అతడు ఆత్మహత్య చేసుకున్నాడా?"

"ఔనమ్మా! ఉదయమే చనిపోయాడు. అయిదు రూపాయలు దొరికితేచాలు; వీళ్ళకెంతో ఉపకారం జరుగుతుంది" అని పలికి మేనేజరు కుర్రవాడివైపు తిరిగి "చేతులు జోడించి 'అమ్మా! అయిదురూపాయలు భిక్షపెట్టండి' అని ప్రార్థించరా నాన్నా" అన్నాడు.

కుర్రవాడు అలాగే మేనేజరు చెప్పినట్లే ఏడుస్తూ పలికాడు. వాడి చేతులు అంజలించి అలాగేవున్నాయి. ఆలేఖ్య

చిత్రగతమైన మూర్తిలాగా నిశ్శబ్దమై అతనికేసి అలాగే చూస్తూ వుండిపోయింది.

కుర్రవాణ్ణి తీసుకుని వ్రజబాబు వెళ్ళిపోయాడు. దహన సంస్కారం మొదలుకొని శ్రాద్ధం ముగిసేవరకూ కావలసిన ఖర్చుఅంతా ఇక మంజూరు చేస్తుందని ఆయనకు నమ్మకం కలిగిపోయింది. డబ్బులేని కారణంగా గంగూలీ అంత్యక్రియలు ఇక ఆగవు. ఆలేఖ్యకు మాత్రం అంతా దుర్గ్రాహ్యంగా వుంది. పటాలు, బీరువాలు, పెయింటింగులు, అద్దాలు – వీటన్నింటి మీదినుంచి మనస్సు మరలిపోయింది. అక్కడినుంచి లేచి వెళ్ళి ఒకకుర్చీలో పడుకుంది మౌనంగా.

"గదిలో అలమారు ఎక్కడ బిగించమన్నారమ్మా?" అని అడిగాడు వడ్రంగిమేస్త్రీ వచ్చి.

"ఆ సంగతి ఇప్పుడుకాదులే"

"ఇవాళ ఏం వంటచెయ్యమన్నారు అమ్మాయిగారూ!" వంటకత్తె ప్రశ్న.

"నన్ను అడగవద్దు. ఏదో ఒకటి చెయ్యి"

ఒక తాపీమేస్త్రీవచ్చి యింటి మరమ్మతు విషయమై ప్రస్తావించాడు. ఆలేఖ్య సరిగా జవాబు చెప్పకపోవటంచేత అతడుకూడా తిరిగి వెళ్ళిపోయాడు. తనకిప్పుడేమీ అక్కర్లేదనిపించింది ఆలేఖ్యకు ఈ ప్రాంతంలో తలెత్తుకుతిరిగే యోగ్యత తనకు లేదనిపించింది. పాశ్చాత్య పద్ధతిని నూతన సంస్కారాలు తీసుకురావటానికి ప్రయత్నిస్తే ఇటువంటి గొడవలేర్పడతాయని ఆమె కలలోకూడా అనుకోలేదు. చివరకేమైందో చూడు! ఎవరిమీదా తనకు ద్వేషంలేదు; ఎవరికీ తాను అన్యాయం

చేయలేరా. ఒక చిన్న పొరపాటుచేస్తే చేసివుండచ్చు. అయినా అంతమాత్రానికే ఇంత పెద్దశిక్షా? ఆ వ్యక్తి ఆత్మహత్య చేసుకుని తనమీద కసితీర్చుకున్నాడు.

ఆలేఖ్య ఒక నౌకర్ని పిలచి అతనిద్వారా అన్ని విషయాలూ తెలుసుకుంది నయనగంగూలీ ఈ వుద్యోగాన్ని నలభైయేళ్ళ బట్టీ చేస్తున్నాడు. అతడు నిజంగానే మహా దరిద్రుడు రెండు చిన్నపూరిళ్లు తప్పితే అతనికీవిశాల ప్రపంచంలో నాదిఅన్న వసువేమీలేదు. ఈ ముప్ఫయి రూపాయల ఉద్యోగం తప్పితే మరో ఆదాయంలేదు. ఇదే ఆతనికి జీవనాధారం ఆ జీతంమీదే అతని సంసారం అంతా ఆధారపడివుంది. ఈ విషయాలన్నీ సత్యాలే”

ముప్ఫయి రూపాయలనంగా ఎంత? ఒక బీద కుటుంబం ఆహారవిహారాలు, ఆశలు ఆకాంక్షలు, ఆనందోల్లాసాలు ఆ ముప్ఫయి రూపాయలతో సాగిపోతున్నాయి.

ముప్ఫయి వెండిరూపాయలు! పెద్దమొత్తమేమీ కాదు. ఆలేఖ్య తొడుక్కునే చెప్పులు అక్కడే పడివున్నాయి. ఆ చెప్పుల్లో ఒక్కటికూడా ఆ మొత్తంతో కొనలేము. • ఈ వెండిరూపాయల విలువ ఎంత? ఈస్వల్పధనంయొక్క యథార్థమైన విలువ ఆమెకీనాడు ఒకవ్యక్తి తన ప్రాణాలర్పించి నేర్పిపోయాడు. కంట్లో వేలుపెట్టి చూపించాడు. ఆలేఖ్య హృదయంలో చీకట్లు కమ్ముకొచ్చాయి. దినమంతా అన్నంలేని ఆ కుర్రవాని హాహాకారం ఆమె చెవుల్లో పొడుస్తున్నది. ఆ యాతనాదానికి ఆది, అంతం ఉన్నట్టులేదు.

ఆలోచనా ప్రపంచంలో పడిపోయింది మనిషి. తన యింట్లో ఖర్చులు స్ఫురణకు వచ్చాయి. తాను, తనతల్లి;

తమ బంధుజనులు, తమలాంటి సభ్యకుటుంబాలు ఆహారవిహారాలకోసం, పండుగలకు పబ్బాలకు, ఆటపాటలకు భోగవిలాసాలకు, చీరలకు సొమ్ములకు, ఎంతెంత ఖర్చుచేస్తున్నారో ఆలోచనకు తట్టేసరికి, వొంట్లో రక్తం గడ్డకట్టినట్టనిపించింది. చేరువనే ముక్కాలిపీటమీద గోడకానించిన నిలువుటద్దంమీద పడింది. దీనికి అయినఖర్చుతో గంగూలీ అయిదు సంవత్సరాలు తన కుటుంబాన్ని పోషించుకోగలుగుతాడు. నిజానికి ఇంత విలువగల అద్దంవల్ల ప్రయోజనం ఏమిటి?

ఆ సాయంత్రం రైలుకు రే యింటికి రావలసివుంది. తండ్రిగారి మానసికదుర్బలత ఆమెకు తెలుసు ఆయనమాటల పట్ల ఆమెకంత శ్రద్ధలేదు. ఇది ఆమెకు తల్లివద్ద నేర్చుకున్న గుణం. ఇతర్ల అనుచితములయిన ప్రసంగాల్ని ఆయన ముందు ఆమె చర్చించలేదు. ఆయన బలహీనతను పురస్కరించుకుని ఎంతోమంది ఇదివరకు అనేకరకాల ఉపద్రవాలు కల్పించే వుంటారు. కాని, రే మాత్రం వాటినిగురించి ఎప్పుడూ అనుకోనేలేదు. పల్లెత్తుమాట ఎవర్నీ అనలేదు. ఆలేఖ్య వచ్చి ఈ పాత పద్ధతుల్ని సమూలంగా పెరికివెయ్యాలని పూనుకుంది. పాతనౌకర్లను, గుమాస్తాలను, తీసివెయ్యాలని ఆమె పట్టుపట్టినప్పుడు వ్రజబాబు గట్టిగా చెప్పనేచెప్పాడు "పెద్దదొరగారికి అది ఇష్టంలేని పని" అని. ఆలేఖ్య ఆమాటను లెక్కచేయలేదు. తండ్రిగారు ఇంటలేనప్పుడు ఆ వ్యవహారం పరిష్కరించాలని చూచింది. కాని గంగూలీ ఆత్మహత్య గావించుకొని ఆమె ఇదివరకెన్నడూ ఎరగని, ఊహించని; ఒకనూత్న సమస్యను తెచ్చిపెట్టాడు. అనేక కొత్తవిషయాలను ఇప్పుడు

ఆమె ఆలోచించవలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. దుర్బల చిత్తుడైన తండ్రిని మనోవీధిలో లక్షిస్తూ ఆమె అన్నది "హృదయ దౌర్బల్యము, కోమలత్వము సామాన్య గుణాలుకావు. నీదృష్టిలో మేముచాలా పొరపాట్లు చేశాము. అయినా నువ్వెప్పుడూ ఆ విషయమై పెదవి కదల్ప లేదు."

తండ్రి జ్ఞాపకం రాగానే ఈ ప్రపంచం ఒక దుకాణం మాత్రమే కాదన్న సంగతి ఆమెకు స్ఫురించింది. త్రాసుతో తూచి విలువకట్టినంత మాత్రాన్నే మానవుడు తోడివానిపట్ల నిర్వర్తించవలసిన కర్తవ్యం ముగిసిపోదు. క్షమాగుణం లేనివాడుకూడా నిరాటంకంగా జీవిస్తున్నాడు. పనిచేసే సామర్థ్యం తగ్గినంతమాత్రాన మనిషికి జీవించే అధికారం లుప్తమై పోవలసిందేనా!

మామూలుగా ఉదయం పూట, సాయంత్ర మప్పుడు, కచేరీ తెరిచి వుండేది. ఆలేఖ్య ఆఫీసురూల్సు ప్రకారం ఒక మార్పు చేసింది. పదకొండు గంటలనుంచి నాలుగుగంటలవరకూ ఆఫీసు పనిచెయ్యాలని ఆమె ఆజ్ఞ. ఆసమయంలో ఆమెకూడా మేనేజరు దగ్గిర కూచుని వ్యవహారాలు చూస్తూ ఉంటుంది. కాని ఈ నాడుమాత్రం ఆమెకు కచేరీకి వెళ్ళాలనిపించ లేదు. అక్కడి గుమాస్తాలందరికీ తన ముఖం ఎలా చూపించగలదు! తన గదిలోనే ఒంటరిగా కూచున్నది. ఆనాడు భోజనంకూడా సరిగా చేయ లేదు.

ఇలాగే రోజంతా గడిచింది. సాయంత్రందాకా గది కిటికీలోనించి బైటికి చూస్తూ కూచుంది ఆలేఖ్య.

స్టేషనుకు వెళ్ళినబండి ఖాళీగానే తిరిగి వచ్చింది. రేగారు రాలేదు. ఆయన ఏ పనైనా ఒక ప్రోగ్రాం ప్రకారం చేస్తారు. నిర్ణయం ప్రకారం ఆయన సాయంత్రంబండికి రాక పోయేసరికి ఆలేఖ్యకు కొంచెం ఆందోళన కలిగింది. కాని ఒక విధమైన మనస్థిమితం కూడా కలిగింది ఆమెకు బాగానే తెలుసు. తండ్రి తనమీద ఏమీ కోపపడడనీ, ఒక్క కఠినవాక్యం కూడా ఆయన నోటివెంట రాదని. కాని ఆయన చూపే మౌనంలో దాగివుండే వ్యథకు తానేమి జవాబు చెప్పాలి? అదొక పెద్ద విషమ సమస్య. సరే ఇవ్వాల్టికి నాన్నగారు రాలేదుగా! బ్రతికిపోయాం అనుకుంది. కొంచెం మనశ్శాంతి కూడా అనుభవించింది ఇంతలో నౌకరు వచ్చి పండిట్‌జీ వచ్చారని చెప్పాడు.

"పండిట్‌జీ ఎవరు? ఎక్కడున్నారాయన?"

గుమ్మం దగ్గరనుంచి కంఠస్వరం వినిపించింది. "నేనే అమరనాథ్‌ను. ఇక్కడే వున్నాను."

"దయచెయ్యండి" ఆలేఖ్య లేచినిల్చుని నమస్కారం చెప్పింది. కాని అధ్యాపకమహాశయుడు ఆనాటివలెనే ఇప్పుడు కూడా గంభీరముద్ర వహించి అలాగే నిల్చున్నాడు. ప్రతి నమస్కారం చేసే ఊహాలేదతనికి. ఇతర లోపాలు గమనించే స్థితిలోలేదు ఆలేఖ్య. ఆమె మనస్సంతా వికలమైవుంది.

తనంత తానేవచ్చి పండిట్‌జీ కుర్చీలో ఆసీనుడైనాడు. "ఒకపెద్ద ప్రయోజనం ఆశించే మీ దర్శనానికి వచ్చాను. లేకపోతే ఈ కానిసమయంలో మిమ్మల్ని బాధపెట్టేందుకు వచ్చేవాణ్ణికాదు."

ఆలేఖ్య మనస్సు పరిపరివిధాల పోయింది. ఈ గ్రామంలో ఎక్కడ ఏమి జరిగినాసరే ఈ పండిట్‌జీకి ఏదో విధమైన సంబంధం వుండితీరుతుంది. గంగూలీ ఆత్మహత్యను పురస్కరించుకునే అతడిప్పుడు వచ్చివుంటాడు. ఇంట్లో నాన్నగారు లేరు. ఈ వ్యక్తితో సంభాషణ ఎలా నడుస్తుందో! తానెలా మాటాడాలో ఏమైనాకానీ అనుకుని ఆలేఖ్య మనస్సు దృఢం చేసుకుని కూచుంది.

పండిట్‌జీ అల్పహాస పూర్వకంగా అన్నాడు: "మీరు ఇవాళ చాల ఖిన్నులై ఉన్నట్టు కనిపిస్తున్నది. కారణం తెలియదు. అయినా నేనావిషయమై మాట్లాడేందుకు రాలేదు. నేను మీ శత్రువునుకాదు"

ఈ వ్యక్తి మళ్ళీ వ్యంగ్యవాక్యాలు విసిరేందుకే వచ్చాడా అన్న అనుమానం కలిగింది ఆలేఖ్యకు. అయినా మనోవిచలిత కాలేదు. మనస్సును వశంలోనే వుంచుకుంది. "మీరెందుకు వచ్చారో చెప్పండి?" అని సహజ కంఠస్వరంతోనే అడిగింది.

"సంత రేపు. కాని పోలీసులు పట్నంనుంచి ఇవాళే వచ్చేశారు. గ్రామంచుట్టు ముట్టేశారు. మీరెందుకు చేశారీ పని?"

ఆలేఖ్య ఉలికిపడ్డది. తానువచ్చిన మర్నాటి ఉదయమే పరిస్థితుల్ని పూర్తిగా అవగాహన చేసుకోకుండానే డిస్ట్రిక్టు మేజస్ట్రేటుకు ఒక ఉత్తరం రాసింది తాను విన్నవార్తలు, వదంతులు మాత్రమే అందులో రాసింది. ఈ వుత్తరంవల్ల ఫలితం ఏమౌతుందో ఆమె ఊహించలేదు. ఈ వుత్తరం మేజస్ట్రేటుదాకా వెడుతుందో వెళ్ళదో! మేజస్ట్రేటు దాన్ని

ఖాతరు చేస్తాడో చెయ్యడో అనుకుంది. ఇప్పుడు మళ్ళీ ఇన్నాళ్ళ తరువాత దాని విషయం వచ్చింది.

"పోలీసులు వచ్చినంతమాత్రాన ఏం మునిగిపోతుందీ?"

"మీరు దూరంగా వుంటారు. మీకేం తెలుస్తుంది నాకు తెలుసు. సవ్యంగా జరిగిపోదు. నాలుగైదు శవాలు లేస్తాయి. సందేహంలేదు."

ఆలేఖ్య భయచిత్త అయింది. "శవాలా! ఎవరి శవాలు!"

"చెప్పలేం. నా శవంకూడా బయటపడవచ్చు."

"మీ శవమా?"

"అసంభవం కాదు. ఆత్మగౌరవాన్ని పురస్కరించుకుని నేనే ముందుగా బలికావలసి వస్తుంది... ఇప్పుడు నాకు తొందర పనివుంది. మరోచోటికి వెళ్ళాలి. చాల దూరం. రేపు ఉదయం మీకు తీరికేనా?"

అమరనాథుని మాటల్లో బలవంతం ఏమీలేదు నవ్వుతూ లేచినిల్చుని "ఇతర్లను కష్టపెట్టే స్వభావం కాదు నాది. ఐనా రేపు వుదయం నాలుగు నిమిషాలు నాకు దర్శనం ఇవ్వాలి" అని పలికి వెళ్ళిపోయాడు.

౪

చీకటి పడుతూవుంది. ఇంకా నౌకర్లెవరూ లాంతరు వెలిగించి తీసుకురాలేదు. ఆలేఖ్య చాల అలసివుంది. మనస్సేమీ బాగాలేదు. మేడమీద పడకగదికి వెళ్ళటానికికూడా ఆమెకు ఓపిక లేకుండా వుంది.

అప్పుడొక ముసలివ్యక్తి పరదా తోసుకుని లోనికి వచ్చాడు. ఆలేఖ్య ఆశ్చర్యపడుతూ సరిగా కూచుని "ఎవరు?" అని అడిగింది.

ముసలివ్యక్తి ఒక కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. "నాపేరు నిమాయీ భట్టాచార్య. అమర్‌నాథ్ నాకు దూరపు బంధువే. నాకు మనుమడౌతాడు. అతడే అన్నమాటేమిటి? ఇక్కడున్నవాళ్ళంతా నాకు మనుమలే. మీ నాన్న రాధా మాధవుడు నన్ను 'బాబాయి' అని పిల్చేవాడు. నేను కాశీలో ఉంటున్నాను ఈమధ్య. మరీ ఈ యేడాది అక్కడ చాలా వేడిగా ఉండటంచేత ఇక్కడికి వచ్చాను. ఏ దేశమైతే మాత్రం మన వంగదేశంలో సాటివస్తుందా? వంగదేశమంటే స్వర్గం అన్నమాట. నువ్వు కులాసాగా ఉన్నావా? మీ నాన్న కులాసాగా వున్నాడా?"

"ఆఁ, బాగానే ఉన్నాం. నాన్నగారు వూళ్ళో లేరు. మీరు ఏంపనిమీద వచ్చారు?"

"ఈ సాయంత్రం వచ్చేస్తారని విన్నానే!"

"ఔను, రావలసిందే. కానీ రాలేదు మరి. వచ్చాక రేపు దర్శనం చేసుకుందురుగాని."

వృద్ధుడు ఆలేఖ్య ముఖంచూసి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. "కాదమ్మా కాదు. నా స్థితిగతులు కొంచెం బాగానే వున్నాయి. నేనేమీ ఆశ్రయించటానికి రాలేదు. నువు విదేశాలుకూడా వెళ్ళి వచ్చావని అమరనాథ్ చెప్పాడు. బాగా చదువుకుని సుశిక్షితులైన ఆడపిల్లలంటే నాకు చాల యిష్టం. అటువంటివాళ్ళతో కాస్సేపు మాట్లాడదామని నాకు

అభిలాష. కాని అట్టి అవకాశం లభించలేదు. ఈ ముసలి వాడిని లెక్కజేసి ఎవరు మాట్లాడతారు చెప్పు! నువ్వు చేరు వనే ఉన్నావుకదా! మళ్ళీ ఇటువంటి అవకాశం దొరుకుతుందో లేదో! నేనా పండిముగ్గిన మామిడి పండును. ఎప్పుడు రాలి పడతానో తెలియదు. ఈ ముసలివానిమీద నీకు కోపంలేదు కదా!"

ఆలేఖ్య సిగ్గుపడుతూ, వినయం నటిస్తూ "అబ్బే లేదండి, ఇవ్వాళ వొంట్లో కొంచెం బాగాలేదు" అన్నది.

"ఆ సంగతికూడా నేను విన్నాను. అమరనాథ్ అంతా చెప్పాడు నాకు. అతను చాలా మంచివాడు. ఆ యీడులో అంత గుణవంతుడు కనిపించడు... పిచ్చివాడు ఆత్మహత్య చేసు కున్నాడు. పాపం! కష్టాలు సహించలేకపోయాడు. శక్తిహీను డయ్యాక మనిషి మనిషికాడనుకో. నా కలాగే తోస్తుంది. గంగూలీగారి ఇంటిముందునుంచే వస్తున్నాను. దహనసంస్కారం కోసం శవాన్ని అప్పుడే తీసుకువెళ్ళారు. ఇంకా నాళ్ళు తిరిగి రాలేదు. లోపల అతని కూతురు గొంతుచించుకుని ఏడుస్తోంది. అయ్యయ్యో! కాస్త పాపానికి ఎంత శిక్ష! డబ్బు వస్తుంది. పోతుంది. చెడ్డపేరుమాత్రం నస్తేపోదు. లోపలికిపోయి 'ఎందుకే దుర్గా అలా ఏడుస్తావు ఏడ్చి ఏంలాభం? ఇంతఘోరం జరుగుతుం దని పాపం ఆమెకుమాత్రం ఏం తెలుసు? తెలిస్తే పనిలోనుంచి తీసేసి వుండదు. ఆమెతో పరిచయం లేదుగాని నాకు బాగా తెలుసు. అయిందేదో అయిపోయింది. ఆమె ఆమెగాంతమూ దీనికి పశ్చాత్తాపపడుతుంది. ఈ కళంకం మాసిపొయ్యేదికాదు' అని చెబుదామా అనుకున్నాను. కాని బాగుండదేమోనని

తోచింది. ఈ దుర్ఘటన గంగూలీ కూతుర్ని ఎంత గాయపరిచిందో, నిన్నూ అంత తీవ్రంగానే గాయపరచింది బిడ్డా!"

అసలే ఆలేఖ్యకు మనస్సు విచలితంగావుంది. ఈ వృద్ధుని మాటల కామె మరింత బాధపడ్డది. కొంతసేపటివరకూ ఏమీ పలుకకుండా అతనికేసే తదేకంగా చూస్తూ వుండిపోయింది. చివర కడిగింది. "ఎవరు చెప్పారు మీ కిదంతా? నేను బాధ పడుతున్నట్టు మీకేం తెలుసు?"

"అమరనాథే అంతా చెప్పాడు నాకు."

"అమరనాథ్ మంచి ఊహాగానమే చేశాడు. అతని మాటలు అతనికే తెలియాలి. గంగూలీ మహాశయుడు సక్రమమైన పద్ధతుల్లోనే ఉద్యోగంనుంచి విముక్తి పొందాడు. మా జమీందారీ వ్యవహారాల్ని మే మొక పద్ధతిని సంస్కరించుకోవటం తప్పా?"

"తప్పని అమరనాథ్ మాత్రం అసలు అనలేదు చెప్పొద్దూ. నీమీద అతడేమీ నేరం మోపలేదు."

"నా కర్తవ్యాన్ని నేను పాలించాను."

ఆ మాటవిని ఆ చీకటిలో ఆమె ముఖవైఖరిని కనిపెడదామని వృద్ధుడు ప్రయత్నం చేశాడు. "ఇం యీ మాటలు చెప్పి యీ డెభ్భైయేళ్ళ ముసలివాణ్ణి కన్నుగప్పలేవు బిడ్డా! కర్తవ్యం అనేది తూచి నిర్ణయించే వస్తువు కాదమ్మా! ఒక అవిటివాడు, అమాయకుడు. మీరిచ్చే అన్నం నీళ్ళతో బతుకుతున్నాడు. ఆ అన్నం నీళ్ళు మీరు బందుచేసేసరికి వాడు ఆత్మహత్య చేసుకున్నాడు. కర్తవ్యపాలన అనే ముసుగులో నిహృదయతాపాన్ని దాచలేవు. పాపం, ఆ దౌర్భాగ్యురాలు

కూతురు గొంతు చించుకుని ప్రాణం పోయేలాగు ఏడుస్తోంది. మనుమడు ఏడుస్తూ శవంవెంట స్మశానానికి పోయాడు. ఈ దుఃఖానికి ఆది, అంతం కనిపించటంలేదు. నా దగ్గర దాచబోను బిడ్డా! చింతతో లోలోపల కుమిలిపోతున్నావు." ఆ వృద్ధుడు ఉత్తరీయపు కొంగుతో కన్నీళ్ళు తుడుచుకున్నాడు. ఆయనకేదో ధ్వని వినిపించింది. విచలితుడై చూశాడు. ఇంత వరకూ ఓర్పుగానే కూర్చునివింటూన్న ఆలేఖ్య అతని చివరి మాటలు చెవిని పడగానే ఇక ఉండబట్టలేకపోయింది. ముందున్న టేబిల్ మీద నుదురు కొట్టుకునేలాగ వాలిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది.

వృద్ధుడు నిమాయిబాబు అలాగే కూర్చున్నాడు. ఆలేఖ్యను ఓదార్చటానికేమీ ప్రయత్నించలేదు. అయిదారు నిమిషాలకు ఆమే స్వయంగా లేచి కన్నీళ్ళు తుడుచుకుంది. నిమాయిబాబు స్నేహపిచ్ఛలమైన కోమల కంఠస్వరాన ఇలా అన్నాడు: "నాకు తెలుసునమ్మా! ఇంతపెద్ద చదువులు చదువుకున్నందుకు నీ హృదయం ఇంత మెత్తనిది కాకుండా ఎలా వుంటుంది? ఈ ఎస్టేటు భారమంతా నీ చెప్పాల్లాగా తేలికైనది కాదు తల్లీ!"

ఇదివరకెప్పుడూ ఆలేఖ్య తన దౌర్బల్యాన్ని ఇతరుల ముందు చూపించలేదు. ఈ అపరిచితవ్యక్తియెదుట ఈ క్షణాన ఆమె యేమాత్రమూ ఆత్మాభిమానం చూపలేకపోయింది. అశ్రువుల నేత్రాలతో గద్గదస్వరాన ఆమె ఇలా అన్నది. "ఈ ప్రాంతంలోనే ఉండిపోదామని వచ్చాను. ఈ సంఘటన జరిగినతర్వాత నా ముఖం ఎవరికీ చూపించలేక పోతున్నాను."

కొంచెం ఆగి ఆయన అన్నాడు. "నీ సంకోచము లజ్జ అసహజములని నేనను. ఆ విధంగా ఓదార్పు చెందటానికి ప్రయత్నించటం అసహజమే. శాశ్వతంగా ఇదంతా వొదిలేసి వెళ్ళిపోతావా, అది సార్థకమే. లేకపోతే లాభంలేదు. ఎక్కడికేనా వెళ్ళిపోయికూడా ఇక్కడినుంచివచ్చే ఆదాయంతోనే జీవిస్తూ ఉండేట్లయితే – ఈ ఆశ్రితజనుల ఆత్మహత్యలకు బాధ్యత వహించాల్సిందే. ఇక్కడ అనుభవించే సిగ్గును, సంకోచాన్ని అణచేసుకుని మరోచోట తలెత్తుకు తిరగగలిగేట్లయితే వద్దు బిడ్డా, నువ్వు వెళ్ళవద్దు; ఇక్కడేవుండు. లోకుల్ని మోసగించాల్సిన అవసరం ఏముందీ?"

"ఇందులో నా తప్పేమీ లేదని ఇక్కడి ప్రజలు విశ్వసించరు"

"అంతా చక్కబడుతుందిలే. వాళ్ళు నిన్ను గురించి వేరుగా అనుకోరు."

"మీరు పొరపాటు పడుతున్నారు"

"కావచ్చు. కాని నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను: సత్యాన్ని స్వీకరింపగల సాహసం నీకు ఏర్పడుగాక!"

నౌకరు లాంతరు తెచ్చిపెట్టాడు. ఆ వెలుగులో ఆలేఖ్య తన ముఖం ఎత్తలేకపోయింది. నిమాయీబాబు చెప్తూను పోతూనే ఉన్నాడు: "నువ్వు బాగా చదువుకున్న పిల్లవు. ఎంతో దూరంనించి నిన్ను చూడ్డానికి వచ్చాను. నీకు తెలసిన శిక్షావిధానాన్ని అనుసరించి యోగ్యత అనేదే అన్నిటినీ మించిన వస్తువని ఒక స్థిరభావం నీకు ఏర్పడింది. బంగారంలాంటి మన యీదేశం మాత్రం ఆ భావాన్ని ఏరూపంలోనూ అంగీ

కరించదు. ఈదేశంలో అవిటివాళ్ళు, దుర్బలులు, అయో గ్యులు, అకర్మణ్యులుకూడా అన్నవస్త్రాలు పొందటానికిఅర్హులే. అయోగ్యుడైనంత మాత్రాన బ్రతికివుండాల్సిన హక్కును కోల్పోడు. గంగూలీని నువ్వు ఆ హక్కునించి వంచితుణ్ణిచేశావు. అతని దుఃఖాలు, కష్టాలు, నీకు తెలుసు. అయినా అతని ప్రాణాలకు విలువకట్టి... నీదివాణంలో అతడు ఖాతారాయ టానికి యోగ్యతను గుర్తుకొన్నావు. నీపని చెయ్యలేనివాని జీతం, వాడికి కావలసిన అన్నపానాలు నీ యినప్పెట్టెలో ఆదా ఔతాయని నీభావం"

ఆలేఖ్యకు మళ్ళీ దుఃఖంపొంగి వచ్చింది. "పరిస్థితులు ఇలా ముంచుకొస్తాయని నేననుకోలేదు. నేనంత క్షుద్రమానిసిని కాదు"

"నువు చదువుకున్న చదువే నీకు అడ్డువచ్చిందని నాకు తెలుసు. మీఖర్చులు పెద్దవి. గౌనులు, ఫ్రాకులు, బూట్లు. మేజోళ్ళు. అద్దాలు, దువ్వెనలు, సబ్బులు, తలనూనెలు, స్నోలు, క్రీములు, ప్రౌడర్లు, లిప్‌స్టిక్‌లు వీటన్నింటికోసం మీరు చేస్తున్న ఖర్చులు విపరీతం. ఒక మానవుడికి ప్రాథమిక అవసరాలైన అన్నవస్త్రాలకంటే ఈవిలాస సామాగ్రినే ఎక్కువమన్నించే యీానుశిక్షణ అది మీాకు ఎక్కడినించేనా సంక్రమించనీ దాన్ని విస్మరించటం కష్టమే. ఒకట సత్యాన్ని నువు పూర్తిగా విశ్వసించాలి. అవిటివానికి కూడా బ్రతకటానికి హక్కువుంది. దైవానుగ్రహంవల్ల నువు ఇంతపెద్ద జాగీరుకు అధికారిణి వైనావు. నువు నీఅలంకరణ సామగ్రిని సమకూర్చుకుంటూవుంటే ఇతర్లు ఆత్మహత్య చేసుకుంటూ ఉండటం జరగ

రాదు. ఏసభ్యతా నియమాల్ని అనుసరించి నువ్వు ఇంత అన్యాయం చేశావో... ఆసభ్యత ఎంత ప్రాచీన మైనదైనా సరే అదే ఉత్కృష్టము ఉచ్చము అనటానికి వీల్లేదు. పని చెయ్యటానికి శక్తిలేని వాళ్ళని చెప్పి, వాళ్ళ హక్కును నువ్వు అపహరిస్తున్నావు ఇవాళ. రేపు వాళ్ళబిడ్డలే నిన్ను అపరాధిగ పరిగణిస్తారు. ముసలివాడినైనాను. అటువంటిరోజు నేను చూచే అవకాశం లభించదు. అయినా అటువంటిరోజు వచ్చితీరుతుంది. మానవత్వం తెలిసిన న్యాయాలయంలో జమీందార్ల జాగీర్దార్ల యుక్తులు, ఆర్గ్యుమెంట్లు న్యాయములని గాని, సత్యములనిగాని అంగీకరింపబడవు ఆమాట బాగా జ్ఞాపకం పెట్టుకో"

ఈ మాటలన్నీ ఆలేఖ్య అంగీకరించిందని చెప్పటానికి వీల్లేదు. మరొకప్పుడైనట్లయితే ఆమెకు చాలకోపం వచ్చేదే. పాపం ఇప్పుడామె మనస్థితి సరిగాలేదు. మీ ఉద్దేశం ఏమిటి? తిరుగుబాటు చేస్తారంటారా? రైతులు అటువంటి ఆలోచనలో ఉన్నారా?" అని అడిగింది.

"తిరుగుబాటు, విప్లవం - ఈ పదాలు చెవికి ఇంపైనవి కావు. ఊహ, మనోభావం అనేవి స్థిరమైన వస్తువులుకావు. వాటికి నుస్వనిశ్చమైన స్థానమూ ఇవ్వలేవు. పరిస్థితులను, శిక్షణను ఆధారంచేసుకని ఉంటాయి మనోభావాలు. పరిస్థితులు, మనోభావాలు పెనవేసుకుని ప్రజాప్రవాహం ఎటువైపు ప్రవహిస్తుందో నీకు సూచించాను; అంతే అప్పుడా ప్రవాహాన్ని ఎవరూ ఆపలేరు ఇంతవరదాకా విజ్ఞానవంతులనబడేవాళ్లు సాధారణ ప్రజల్ని నల్లమందు తినిపించి జోకొట్టి నిద్రపుచ్చారు. ఇప్పుడు వాళ్లు ఆకలిమంటలతో నిద్రేంపోతారు!

ఆకలి పొట్టలు చేతపట్టుకుని వీళ్ళంతా మీ పురాతన నీతులు, రీతులు మన్నిస్తారనుకోకు బిడ్డా!"

ఆలేఖ్య కాసేపు మౌనంగావుండి అడిగింది, "ఇంతకూ మా పాశ్చాత్య విద్యావిధానానిదే దోషం అంటారా?"

"నేను 'దోషం' అనేపదం ఉపయోగించ లేదు. ఇదంతా దాని ఫలితమేనన్నాను."

"చెడ్డఫలితం!"

నిమాయిబాబు నవ్వాడు: "మంచి ఫలితమనిగాని, చెడ్డఫలితమని గాని నేను అనలేదు, ఫలితమనే అన్నాను. నేను ఈ కళ్ళతో చూచానమ్మా: ఇంత పొగాకుముంపు, అరుకానులు ఇస్తే కూలివాడు రోజంతా పనిచేసేవాడు. దానితోనే వాడి సంసారం వెళ్ళిపోయేది. చేసినపని చక్కగా చేసేవాడు. ఆ రోజుల్లో రూపాయి దొరికేదికాదు. కాని తిండి కావలసినంత ఉండేది. రైళ్ళులేవు, ఓడలులేవు, విదేశీదొరలు. స్వదేశీ మార్వాడీలు దేశంలోని ధాన్యాన్ని విదేశాలకు ఎగుమతీచేసి కోట్లు లాభం తీయటం అప్పుడు ఎరగరు. లక్షలాదిప్రజల నోటి దగ్గర అన్నం తీసే విధానాలు అప్పుడులేవు. పేదలకు చెందవలసిన అన్నం ముద్దల్ని వెండిబంగారంగా మార్చి ఇనప పెట్టెల్లో నిల్వజేసుకునే యుక్తులు కుయుక్తులు అప్పుడులేవు."

ఆ ముసలివాని కన్నులు కాంతివంతములైనాయి. చెప్పుకు పోతూనేవున్నాడు: "బిడ్డా! నా చిన్నతనంలో మనిషి అనే వాడు తాను బ్రతికివుండటానికి అర్థాంతరుజుపు చేసుకోవలసిన అవసరం వుండేదికాదు. అందుకుగాను ఒక కఠిన పరీక్షను ఎదుర్కోనక్కర్లేదు. ఇప్పుడు దేశస్థితి ఎలాఅయిందో చూడు.

పిడికెడు ధాన్యంకూడా బిచ్చం వెయ్యకూడదు. విజ్ఞానులు, వ్యాపారులు దాన్ని వెండిబంగారంగా పరిగణిస్తారు. అర్థ శాస్త్రజ్ఞులు ఇదంతా అభ్యుదయం అంటారు. అస్తమానం గ్రామాల్లో సంచరిస్తూన్న మాకు తెలుసు. ఇది ఎటువంటి 'అభ్యుదయం' అయిందీని.

నిమాయిబాబు కంఠస్వరమూ, ముఖకవళిక ఆలేఖ్యకు అసహ్యంగా ఉన్నాయి. 'రైళ్ళు ఓడలు మంచివి కావని మీ ఉద్దేశం అన్నమాట!"

నిమాయిబాబు నవ్వాడు: "ఏవస్తువుగాని హఠాత్తుగా మంచిదనిగాని, చెడ్డదనిగాని చెప్పటం కష్టం. ఇతరవస్తువులతో, వ్యక్తులతో కలిపి దాని మంచీచెడుగులు నిర్ణయించాలి."

ఆలేఖ్య మందహాసం చేసింది: "మీరు మాటలతో మెలికలు వేస్తున్నారు. అసలు విషయం నేను చెబుతావినండి. మీవంటి పండితజనులకు పాశ్చాత్య సభ్యతఅంటే పూర్తిగా అసహ్యం. విదేశీయమైనదంతా తుచ్ఛమని, మీసాంప్రదాయిక మంతా ఉత్కృష్టమనీ మీ దృఢనిశ్చయం. వాళ్ళ విజ్ఞానం, సభ్యతకూడా మీరు తెలుసుకునేంతవరకూ మీరు రెంటినీ పోల్చి ఏమినిర్ణయం చెయ్యటానికి వీల్లేదు."

వృద్ధుడు కాస్సేపు తలవంచుకుని ఆలోచనా నిమగ్నుడైనాడు. తరువాత తలెత్తి ఆలేఖ్యవైపు చూస్తూ ఇలా చెప్పాడు: "నన్నుగూర్చి నేనే చెప్పుకోటం అంతబాగుండదు. నీమాటలను బట్టి ఇంతసేపటినించీ నాయాంథార్యాన్ని దాచి వుంచిన అపరాధినైనానని తోస్తున్నది. నేనొకపెద్ద ఉపాధ్యాయుడినే. అమరనాథ్ నాదగ్గర చదువుకునే యం. యే.

ప్యాసైనాడు. సంస్కృతంకూడా నేనే అతనికి నేర్పాను. నువ్వు సూచించిన వాళ్ళ సంస్కృత సభ్యతలలో నేను సంపూర్ణ పారంగతుణ్ణి కాకపోయినా, వాటిని గురించి తెలియనివాణ్ణి మాత్రంకాదు"

ఎవరోవచ్చి తన గొంతు నులిసువేసినట్టు ఆలేఖ్య మిక్కిలి తపనపడ్డది. ముఖం పాలిపోయింది. వృద్ధుడామె ముఖ లక్షణాల్ని పరికించి అన్నాడు. "నువ్వు ఇవాళ చాల అలసి పోయావమ్మా! ఇక పైకివెళ్ళి పడుకో: అమరనాథ్ ఏ యిక్కట్టులోనో చిక్కుపడకుండా వుంటే - రేపు మేమిద్దరమూ వస్తాం. ఇక వెడతాను. 'అంటూ లేచాడు. ఇంకా ఏమో చెబుదామనుకున్నాడు గాని, చెప్పకుండానే వెళ్ళిపోయాడు.

౨

రేగారు మర్నాడు వచ్చారు. రావటంతోనే నయన గంగూలీ ఆత్మహత్య చేసుకున్నట్టు తెలిసింది. రే చాల విచార పడ్డాడు. కూతుర్ని కలుసుకోకుండానే గంగూలీ యింటికేసి వెళ్ళాడు. అలా వెడతాడని ఆలేఖ్య అనుకోనేలేదు.

ఆయన తిరిగి ఇంటికి వచ్చేసరికి సాయంత్రం అయింది. ముఖం ప్రసన్నంగానేవుంది. ఆ సంఘటన విషయమై అతడు కూతురుతో ఏమీ ప్రసంగించలేదు. గంగూలీ కూతురుతో ఆయనేమి మాట్లాడాడో, ఏమిచేశాడో ఆలేఖ్యకేమీ తెలియదు. ఆ రాత్రి గడిచిపోయింది.

మర్నాడు ఉదయం ఆలేఖ్య తండ్రిదగ్గరకు వచ్చింది. ఆమె చేతిలో ఒక ఉత్తరం వుంది. "ఇవాళ సాయంత్రం బండికి ఘోష్ బాబు వస్తున్నాడు. ఇందు కూడా!"

"ఘోష్ బాబా ?"

"కాదు. కాదు. కమలకిరణ్, ఘోష్ బాబు, ఇంనుతల్లి ఇంకా అయిదారు రోజులాగి వస్తారు."

"సరే"

"వారి స్వాగత సత్కారాలకు ఏమీ ఏర్పాట్లు చెయ్యటానికి తీరకలేకపోయింది."

"చెయ్యలేదా? ఈ అయిదారు రోజుల్లో చెయ్య వచ్చులే. ఏమంటావు ?"

"కష్టం నాన్నా !" అని కాసేపాగి "ఒక దుర్ఘటన జరిగింది. నువ్వు వినే ఉంటావు. చాల విచారకరమైన విషయం."

"ఔను"

"వాళ్ళకోసం ఏమైనా ఏర్పాట్లు చేశావా ?"

"ఊహుం. తీరిక ఏదీ?"

రే మరి మాట్లాడలేదు. కూతురుమాట అతడెప్పుడు తిరస్కరించలేదు. ఆమె మనస్సుకెప్పుడూ ఏవిధమైన కష్టమూ కలిగించలేదు. ఈవృద్ధాప్యంలో తన సర్వస్వం ఆమె ఒక్కతే. ఆమె పోషణలో తానొక శిశువై పోవాలని ఆయన కోరిక. ఆమెకు ఇష్టంలేనిది, ఆమెకు విరుద్ధమైన పని అతడేమీ చెయ్యను-చెయ్యలేదు.

"ఏదో ఏర్పాటు ఎందుకు చెయ్యలేదూ ?"

"యజమానురాలివి నువు. నేనన్ని వదులుకున్నాను. అధికారమంతా నీకు వొప్పజెప్పేశాను. మంచిగాని, చెడుగాని భారంనీదే. చెయ్యాల్సిందేమిటో నువ్వే చెయ్యి."

"తెలియక నేను తప్పుచేస్తే నువుగాకపోతే ఎవరు దిద్దుతారు" ఆలేఖ్య గద్గదస్వరాన అన్నది.

"నేను పెద్ద తెలిసినవాడినా? తెలియక నువ్వు ఏదేనా పొరపాటుచేస్తే భగవంతుడే దాన్ని సరిదిద్దుతాడు. బుద్ధి ఇచ్చినవాడే దానికి వికాసంకూడా ఇస్తాడు."

రేగారి చూపులు తెరచివున్న కిటికీలోనుంచి దూరాన ఎక్కడో శూన్యంలో లగ్నమై వున్నాయి. అప్పటి అతని ముఖలక్షణం ఆమెకు చాలకొత్తగా వుంది. ఆమె నిస్తబ్ధయై చూస్తూవుంది. ఆయన కేవలం లండన్ నుంచి దిగిన దొరగారే ననీ, ఆయనకు ధార్మికదృష్టి తక్కువనీ ఆలేఖ్య అభిప్రాయం చిన్నప్పటినుంచీని. భగవంతునిలో నమ్మకం ఉందీ, లేనిదీ- ఏమీ కనిపించనిచ్చేవాడు కాదు. అందుచేత చాలమంది అతన్ని నాస్తికుల లిస్టులో చేర్చారు. కాని పూర్వంలాగే ఇంట్లో పూజాపాఠాలు, జపానుష్ఠానాలు సాగుతూనేవున్నాయి. దానాలు, ధర్మాలు యథాపూర్వంగా సాగుతూనే వున్నాయి. దీన్నే ధర్మభీరుత్వం అనీ, మానసిక దౌర్బల్యం అని రేగారి భార్య వ్యాఖ్యానిస్తూ వుండేది. ఆలేఖ్యకుకూడా అదే అభిప్రాయం. కాని ఈ సమయంలో అతని ముఖలక్షణాలు ఆమె దృష్టిని అతని స్వభావముయొక్క మరొక వైశిష్ట్యంకేసి ఆకర్షించినవి.

"నువు ఉన్నన్నాళ్ళు ఈ భారం నువ్వే వహించు నాన్నా!" అన్నది ఆలేఖ్య మెల్లిగా.

"ఏమిటమ్మా!"

"నేను మీ ఆజ్ఞను ఉల్లఘించాను."

తండ్రి ఆశ్చర్యంగా కూతురువైపు చూచాడు "ఏమి ఆజ్ఞ అది ఆలో! నేనేవీ ఆజ్ఞాపించినట్లు జ్ఞాపకం లేదే."

ఆలేఖ్య మాట్లాడలేదు. ముఖం వాల్చుకుని చీరఅంచు వ్రేలికి చుట్టుకుంటూ నిల్చుంది.

"మాట్లాడవేం తల్లీ!"

వెంటనేగాక, కాసేపు ఆగి జవాబు చెప్పింది ఆలేఖ్య: "వందసార్లు చెప్పాను నేను: తప్పుచేశాను నాన్నా! అని గంగూలీ మహాశయుడు ఇంత తీవ్రంగా నన్ను శిక్షిస్తాడని నేను కలలోకూడా అనుకోలేదు. నీకు కూడా నాముఖం చూపించలేను. ఎక్కడికేనా లేచి వెళ్ళిపోతాను" అంటూ ఆలేఖ్య వెక్కి వెక్కి ఏడవసాగింది. తండ్రి కూతుర్ని దగ్గరకు తీసుకుని తలనిమిరాడు. ఏమీ పలుకరించలేదు. ఓదార్చలేదు. అయిదారు నిమిషాలు గడిచాయి. ఈస్వల్పకాలంలోనే దుర్బల హృదయుడని తాననుకుంటూన్న తండ్రితో ఈనాటి తన పరిచయం మధురము, అవర్ణనీయముగా ఆలేఖ్యకు తోచింది. అయనలోని ఈ యపూర్వమాధుర్యాన్ని అభాగ్యురాలు తనతల్లి ఏనాడూ అనుభవించలేకపోయెకదా అని రవంత విచారమూ కలిగింది. ఆయన బ్రహ్మసమాజ సభలకు వెళ్ళడు; ఉపాసనాదికాల్లో పాల్గొనడు. అందుచేత తల్లి అతన్ని నాస్తికుడని ఏవగించుకునేది. అతని మనోదౌర్బల్యానికి బంధుమిత్ర వర్గంలో తాను చిన్నబోయేది. తండ్రి అంటే ఆలేఖ్యకు ఆపేక్ష. కాని అతని యెడల ఒకరకమైన అశ్రద్ధ తనకుకూడా తల్లిద్వారా సంక్రమించింది. అమాయకుడు, సహనశీలి అయిన అతన్ని ఆలేఖ్య తల్లి పిరికివాడు, దుర్బలహృదయుడు అని ఉపేక్షాభావంగా

చూచేది. అట్టి ఉపేక్షాభావమే ఆలేఖ్యకు ఉంది. ఈ క్షణాన మాత్రం ఆమెకు తండ్రిపట్ల భక్తి, శ్రద్ధ, ప్రేమ పొంగి వచ్చాయి. ఇట్టిరూపంలో తండ్రిని ఆమె ఇదివరకెన్నడూ చూడ లేదు. పశ్చాత్తాపంతో, ఆత్మధిక్కారంతో ఆమె అంతరాత్మ నిండి పోయింది. తండ్రి కూతురు తల నిమురుతూనే ఉన్నాడు. కూతురు ఆలోచిస్తూనే ఉంది. తనవలెనే దుర్బల హృదయుడని భావించి నయన గంగూలీని తండ్రి కనికరిస్తూ ఉండాలి. ఇటు వంటి దుర్ఘటన జరిగిందే అన్న పశ్చాత్తాపం అతని హృద యంలో రగిలింది. కనుకనే వాళ్ళింటికిపోయి గంగూలీకూతుర్ని, మేనల్లుడినీ చూచివచ్చాడు. వాళ్ళకు ఏమి యేర్పాట్లు చేసి వచ్చాడో తెలియదు. ఈఅన్యాయం అంతా చేసిన నన్ను ఒక్క మాటకూడా అనలేదు సూచనగా నయినా ఆప్రసంగం తనకు రాలేదు. నామీద ఈఎస్టేటుభారం వేశాడు; నేను తప్పు చేసినా మళ్ళీ ఆ బాధ్యత తాను తీసుకోలేదు. అలా తీసు కుంటేనే నేను సిగ్గుపడిపోతానని ఆయన భయం. దీన్నికూడా ప్రపంచం హృదయదౌర్బల్యంగానే వ్యాఖ్యానిస్తుంది. కాని నిజానికిది ఆయన విశ్వాసంయొక్క, ప్రేమయొక్క, శక్తి."

ఆలేఖ్య కన్నీళ్లు తుడుచుకుంది. "నాన్నా! ఎస్టేటుభారం నువుమళ్ళీ గ్రహించకపోతే పోనీ నాకైనా నువు దారి చూపుతూ ఉండాలి."

రేగారు నవ్వారు. "నీకు తెలియనిదేముందమ్మా? అయినా నేను పూర్వకాలపు వాణ్ణి." పాతకాలం మాటలే చెబుతాను"

"అవే నాకిష్టం నాన్నా!"

"అయితే సరే."

ఆలేఖ్య కాసేపు మౌనంగా వుండి అన్నది: "అందరి నడక దృతంగా వుంటే నువ్వు ఎందుకు వెనుకపడే వున్నావో నాకు ఇప్పుడు అర్థం అయింది. ఇకనుంచి నేను నీ అడుగుజాడల్లోనే నడుస్తాను. నువ్వు ఆశీర్వదించాలి"

"పిచ్చిపిల్ల!" అంటూ నవ్వి మళ్ళీ కూతురుతల నిమిరాడు. "ముసలివాని అడుగుల్లో అడుగు వేసుకుంటూ నువ్వు నడవగలవా? మీకు ఓపిక వుండొద్దూ?"

"పరిగెత్తటమే ప్రగతికాదని నాకు అర్థమైంది. ఇదివరకల్లా నీది మందగమనమనీ, నువ్వు చాలవెనుక పడివున్నావనీ, భావించాను. ఇక నీ చరణ చిహ్నాలే నాకు మార్గదర్శకాలు"

రేగాసు కూతురుమాటలు సావధానంగా వింటూన్నారు. చెయి ఆమె తలపై తిరుగాడుతూనే వుంది. అతని శుభాశీర్వాదం అయిదు వ్రేళ్ళగుండా ఆమె నరనరాలకు ప్రసరిస్తున్నట్టుంది.

కాసేపు నిశ్శబ్దం. చివరకు ఆలేఖ్య చెప్పింది. "నాన్నా! నిన్న మీ ముసలిబాబాయి వచ్చారు."

"ముసలి బాబాయా?"

"నువ్వు చిన్నప్పుడు బాబాయి అని పిల్చిన నిమాయీ బాబు.'

"ఆయన ఇంకా బ్రతికేవున్నాడా? అటువంటి నిజాయితీ మనిషి యీ కాలంలో కనిపించదు. ఆయనకు ఇక్కడేమీ "అమర్యాద" జరగలేదు కదా!"

"లేదు. ఆయన నిన్ను చూడ్డానికి వచ్చారు. పూర్వకాలంలో వంగదేశం ఎంత సంపన్నంగా వుండేది. పళ్లు, పూలు

ధనం, ధాన్యం, అందం, చందం - పుష్కలంగా వుండేవి. నా దోషం పెద్దది. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. అది నేను ఒప్పుకున్నాను. నయనగంగూలీ విషయం మాట్లాడుతున్నాను నాన్నా! నా తప్పువల్లే అతడు ఆత్మహత్య చేసుకున్నాడు. ఈనాడు ఈ దేశంలో మానవుని ప్రాణం కాపాడే సద్బుద్ధే లేదా! బంగారం పండిన ఈ దేశాన్ని ఇలా నిర్జీవం చేసి విడిచిన వారి అపరాధానికి హద్దువుందా?"

రేగారు పెద్ద నిట్టూర్పు విడిచారు. "ఆ రోజులైతే గంగూలీ అన్నంలేక ఆత్మహత్య చేసుకునేవాడుకాదు. ఉద్యోగంలోనుంచి తీసివేసినా అన్నానికి లోటువుండేదికాదు. రెండు ముద్దల అన్నం దొరక్కపోదు అతనికి..."

"పని చెయ్యలేడని చెప్పి పనిలోనుంచి తీసేశాను. పూర్వపురోజుల్లో అయితే పనిపోయినా నిరాశ్రయుడయ్యేవాడు కాదు; నాకీ అపకీర్తి వచ్చేదికాదు." ఆలేఖ్య కాసేపు ఊరుకుని మళ్ళీ ఆరంభించింది. "ఐశ్వర్యదృష్ట్యా, సభ్యతాదృష్ట్యా ప్రపంచం ముందుకుపోతూ వుంటుందని - వంగదేశ ప్రగతికి అగ్రదూతలం మేమేనని - మీరంటారు. అదంతా పట్టి తమాషా కాకపోతే యేమిటి? గంగూలీ పీడితాత్మ శాంతి పొందుగాక! సభ్యత అంటే? రాక్షసికాదూ? బీదవారి నోటి అన్నాన్ని - సాధారణ ప్రజల జీవికను తన గుప్పెటలో పెట్టుకుని వాళ్ళను పీడించే సభ్యత రాక్షసికాకపోతే ఏమౌతుంది? నాకీ సభ్యత వద్దునాన్నా. అసభ్యంగానే వుంటాను ఈ ఫాసును ఎంతత్వరగా అంతరింపజేస్తే అంతమంచిది."

రేగారు తలెత్తి చూచారు. కూతురి దుఃఖపూరిత హృదయవేగాన్ని శాంతపరచాలన్న తలంపుతో అన్నారు.

"మరి గత్యంతరం ఏమిటమ్మా! బీదవాళ్ళు ఎప్పుడూ ధనవంతుల పిడికిలిలోని వారే. అది సృష్టి విధానం."

ఆ లేఖ్య హృదయవేగం తగ్గలేదు. "ఈవిధానం ఎంత ప్రాచీనమైనదైనా సరే ఏవిధంగానూ అది మంచిదనటానికి వీల్లేదు. ధనవంతులు, బీదలు ఉంటే ఉండవచ్చు. (కాని ఒకని ప్రాణం మరొకని గుప్పెటలో నలుగుడు పడటం మాత్రం చాల చెడ్డ సంగతి.) ఈవిధానం శుభకరమైనది కాదు. పైగా అశుభ హేతువుకూడాను. (ఈవిధానం అటు ధనవంతులకు గాని, ఇటు బీదలకుగాని ఎవరికీ మంచిది కాదు.) మరొకని చేతిలో ప్రాణం ఇరికించుకున్నవ్యక్తి నోరెత్తి ఏమీ మాట్లాడలేదు. గంగూలీకి మతి బాగ లేదంటారు. కాని నాయీ ఒక్క అద్దానికి పెట్టిన ఖర్చును అతనికి అయిదు సంవత్సరాల సంసార ఖర్చుకు సరిపోతుందన్న విషయం నేను మరచిపోలేను. నాబూట్లలో; మేజోళ్ళలో, చీరల్లో, జాకెట్లలో ఇంకా ఇతరవస్తు సామాగ్రిలో ఎంతమంది గంగూలీల జీవనయాత్రకు కావలసిన డబ్బో దాగివున్న సంగతి నేనెలా మరచిపోను?"

ఆమాటలకు రేవిస్తు పోయాడు. భయంతో రోమాంచితుడైనాడు. నవ్వటానికి ప్రయత్నం చేశాడు. "ఈ పిచ్చికేమన్నా అంతం ఉండలా! అంత లోతుగా ఆలోచిస్తే ప్రపంచంలో వుండగలవా అసలు?"

"ముసలివాని నెత్తురుచుక్కలు నీతలమీదే పడివుంటే?"

ఈయపరాధ తీవ్రతను గురించిన నీ అంచనా హద్దులు దాటి పోయింది"

"నేనీకళంకాన్ని మాపుకోలేనా నాన్నా?"

"ఎందుకు మాపుకోలేవూ? నువ్వేం చేస్తే నేను కాదంటాను?"

ఇంతలో ఒక కవరు పట్టుకుని నౌకరు వచ్చాడు. ఆలేఖ్య కవరు అందుకుని చించింది. లోపల ఉన్న లేఖ చదివి తండ్రి చేతికిచ్చింది. "ఇంకా, కమలకిరణ్ వస్తున్నారు"

"ఎప్పుడు?"

"ఇవాళే సాయంత్రం రైలుకు"

ఆలేఖ్య అక్కడినించి వెళ్ళిపోయింది.

రేగారు అక్కడే కూర్చుని ఈ విషయం ఆలోచించారు.

ఈ దుర్ఘటన ఆలేఖ్య హృదయాన్ని గాయపరిచింది. తుఫాను రేగింది. ఈ తుఫాను ఆమె జీవితంలో ఎటువంటి ప్రభావాన్ని ప్రసరిస్తుందో! సమాజం ఈ సంఘటనను ఎలా అర్థం చేసుకుంటుందో!

ఇన్నాళ్ళనుంచీ రేగారు ఏ సమాజంలో తన జీవితం గడిపారో దాని ఆవరణ చిన్నది. ఈ సమాజంపట్ల తనకున్న ప్రీతి క్రమశః సన్నగిలిపోయింది. ఈ మాట తానైే రేగారు యెన్నడూ అనలేదు. కాని ఆ సంగతి ఆ సమాజపు పెద్దలకు తెలుసు. అయితే ఈ సమాజాన్ని విడిచిపెట్టి తన కూతురు సుఖపడదని తానెన్నడూ ఊహించలేదు. ఏ సమాజంలో పెరిగి పెద్దది అయిందో ఆ సమాజంలోనే వుండి సుఖపడగలదనీ ఈ ఆవరణదాటి మరెక్కడికీపోయి వనలేదనీ అనుకున్నాడు.

ఘోష్ బాబు కుటుంబం అంటే అతనికో రకమైన ఉపేక్షాభావం వాళ్ళకు తనకూతురుపై కన్నువున్నమాట తెలుసు. అది తనకిష్టం లేదు. కాని ఇప్పుడు కమలకిరణ్, ఇందు

రావటం మంచిదే అని తోచింది. ఇందువల్ల ఆలేఖ్య మానసిక అశాంతి కొంతతగ్గవచ్చు. ఆలేఖ్యకు చిన్నప్పటినుంచీ స్నేహితురాలు. కమలకి ఇందు ఆగమనంకూడా అవాంఛితమేమీకాదు. శేగారుకూడా అతిథులు రావాలనీ, వాళ్ళకు మర్యాద చేయాలనీ కోరిక కలవాడే. ఏదో దుర్ఘటన అయితే జరిగింది. గంగూలీ బ్రతికిరావటం అసంభవం. గ్రామంలో దుఃఖం, గ్లాని తుఫానులాగా ఆవరించాయి. ఈ తుఫానుకు ఆలేఖ్య మిక్కిలి విచారగ్రస్త అయింది. ఇందు, కమలకిరణ్ వస్తున్నారు మంచిదే. అమ్మాయికి మనస్సు బాగుపడుతుంది. వాళ్ళున్న నాలుగురోజులైనా ఈ అంశం మరచిపోతుంది, మిత్రబృందాన్ని సత్కరించటంలో వ్యగ్రురాలై కొంత మనశ్శాంతి పొందుతుంది అనుకున్నారు శే.

ఇంకా చీకటిపడలేదు. ఇందు కమలకిరణ్ రానేవచ్చారు. శేగారు వారికి స్వయంగా స్వాగతం ఇచ్చారు. ఆలేఖ్య తండ్రి ప్రక్కనే వుండి సంఘసభ్యత ననుసరించి స్వాగత సత్కారాలు నడిపింది, ఏమీ లోటురానీయలేదు. కాని ఆలేఖ్య ముఖకవళికల్లో ఇందు, కమలకిరణ్ ఏమిచూశారోగాని సంకోచ భావంతో వెలవెలబోయారు.

బైట ఎవరికీ తెలియదు. ఇంట్లో మాత్రం ఆడంబరంగానే ఉంది. భోజనపు ఏర్పాట్లు విపరీతంగా జరుగుతున్నాయి. ఇన్నాళ్ళనించి నిద్రపోతున్న ముసల్మాన్ వంటవాడికి ఇవాళ పని తగిలింది. పువ్వులు పూసేకాలం కాకపోయిందిగాని లేకపోతే టేబిల్ మీద రకరకాల పూలు శోభిస్తూనే ఉండేవి. లైట్లు అవసరానికి మించి వెలుగుతున్నాయి, వార్నిషు పూసిన

గోడకు తగిలిగించిన అద్దాల్లోనించి దీపకాంతులు ప్రతిబింబిస్తూ రేయిని పగలుగా చేస్తున్నాయి వెండికత్తులు, వెండిఫోర్కులు వెండి చంచాలు, ఖరీదుగల గ్లాసులో సుగంధజలాలు మంచు లాంటి తెల్లని మేజాబల్లమీద ఈ వస్తువులన్నీ మెరుస్తు న్నాయి. అందం, ఆడంబరం, సింగారం డ్రెస్సులు, ఫేషనులు, మాటలమజా, పకపకలు, వికవికలు దుఃఖభూతం ఈ యిల్లు విడిచి ఎక్కడికో పారిపోయిందా అన్నట్లు ఉంది

డిన్నరు సాగిపోతోంది. రేగారు కూడా ఒకరకమైన ఉత్సాహంతో ఉన్నట్టే కన్పిస్తున్నారు. కత్తి ఫోర్కు అతడు ఉపయోగిస్తున్న తీరు చూస్తే అతడు అజీర్ణ వ్యాధితో బాధ పడుతున్నట్టు లేదు. సరిగ్గా ఆ సమయంలో నౌకరు వచ్చి ఒక చీటీ టేబిల్‌మీద పెట్టాడు. దగ్గర కళ్ళజోడు లేదు. అందు చేత రేగారు ఆచీటీని ఇందు కూర్చున్నవైపు త్రోసి "చూడమ్మా ఎవరోను" అన్నాడు.

"అమరనాథ్" అన్నది ఇందు చీటీ చూసి.

రేగారు ఆశ్చర్యపోయారు. "తిరిగి వచ్చేశాడన్నమాట! నేననుకుంటూనే ఉన్నా" మళ్ళీ కమలకిరణ్ వైపు తిరిగి: "అతడు ఇంచుమించు మాయింటి మనిషే" అంటూ "అతన్ని వెంటనే ఇక్కడికే తీసుకురా" అని నౌకరును ఆజ్ఞాపించాడు.

"ఇక్కడికా ?" ఆలేఖ్య శంకిస్తూ అన్నది. రేగారు కూతురువైపు చూడ్డం లేదు. అన్నాడు "అభ్యంతరం ఎందుకూ? కమల్ ! అటువంటి యువకుణ్ణి నువ్వు ఎప్పుడూ చూచిఉండవు. ఈదేశంలోనేకాదు, విదేశాల్లోకూడా చూడవు" అంటూ నౌకరు వైపుతిరిగి "ఇంకా నిల్చున్నావే ? అమరనాథ్‌ను లోపలకు తీసుకురా !" అన్నాడు.

నాకప వెళ్ళి వెంటనే అమరనాథ్‌ను వెంటబెట్టుకుని వచ్చాడు. కాళ్ళకు చెప్పులులేవు. నీరసంగా ఉన్నాడు. పొద్దుటి నించీ చిక్కడు నీళ్ళైనా తాగినట్టు లేదు. తల మీద ఏదో కట్టు కట్టి ఉంది. నెత్తురుచార ముఖంమీద భయావహంగా కని పిస్తోంది. రేగారు చేతిలోని కత్తి ఫోర్కు జారిపడిపోయాయి. ఆతృతగా "ఏమయింది అమ నాథ్ ?" అని అడిగాడు.

అమరనాథ్ విభ్రాంతుడై చూచాడు నాలుగు వైపులా. భోకలకు క్షణకాలం అంతరాయమే కలిగింది. అంతా ఆకలితో మాడిపోతూన్న ఈ గ్రామంలో ఈయింట్లో మహావైభవంగా ఈ విందు! మానవసంఘంలోని హృదయ శూన్యత మూర్తీభవించినట్టుగా ఉంది!

రేగారికి భయం కలిగింది. మనస్సు పరిపరివిధాల పోయింది. ఏమితింటున్నాడో రుచి తెలియకండా తిన్నాడు. చివరకు టేబిల్ దగ్గరనించి ఇవతలకువచ్చి ఒక పడకకుర్చీలో వాలి "ఏమిటి ఇదంతా అమరనాథ్'' అని అడిగారు.

"మీరు ఏమి తెలుసుకోగోరుతున్నారు?''

"విచారపడుతున్నా వెందుకూ? అన్ని సంగతులూ చెప్పు. ముందు చెప్పు, నీకీగాయం చేసిందెవరు? పోలీసు లేనా?''

అమరనాథ్ తల అడ్డంగా ఊపాడు. "కాదు. గ్రామ స్థులే. కాని అదేసత్యం అందామంటే – కాదు."

"అయితే అసత్యం ఏదో అదే చెప్పు"

"నా నెత్తురుచుక్కలు కాసిని చిందాయి. అదే సత్య మైన మాట?"

రేగారు విస్తుపోయి చూస్తూ అన్నాడు: "ఇది మా సంత లోనే జరిగిందా ?"

"ఔను."

"ఇంతవరకూ నీకు భోజనం లేదా ?"

"లేదు"

"మీ యిల్లు చాలదూరం. ఇక్కడ మళ్ళీ ఏర్పాట్లు చెయ్యాల్సిన అవసరంలేదు. కాస్త భోజనంచేసి పోగూడదూ?"

"ఊహుఁ" అమరనాథ్ మందహాసం చేశాడు.

"అయితే నువ్వు ఇవాళ పూర్తిగా ఉపవాసమే నన్న మాట !"

అమరనాథ్ జవాబేమీ చెప్పలేదు. ఉదయంనుంచీ మెతుకు కొరకలేదు. రేగారు ఒక దీర్ఘనిశ్వాసం విడిచి "అయితే నువు వెంటనే ఇంటికిపో. ఆలస్యం చెయ్యకు" అన్నాడు. అంటూ తానే లేచి "పద, నిన్ను కొంతదూరం పంపించివస్తాను" అన్నారు.

"నన్ను పంపించివస్తారా? మీరా? ఏంమాటలు రాయ్‌మహాశయా! ఇప్పుడే భోజనం చేశారు. మీరు లేవద్దు అసలు."

రేగారు మరేమీ చర్చకు దిగలేదు. విషయం ఎటువంటిదైనాసరే చర్చించే అలవాటు అతనికిలేదు. అమరనాథ్ వెడుతూంటే రేగారు అన్నారు. "నువ్వు ఎందుకు వచ్చావో సూత్రప్రాయంగా ఊహించుకో గలిగాను. సరే, రేపొక సారి తప్పకుండా నువు రావాలి"

సరేనన్నట్టు అమరనాథ్ తల ఊపాడు.

రేగారు కమలకిరణ్ వైపు తిరిగి చెప్పారు. "అమర నాథ్ మీద చెయిచేసుకునేవాడు ఈ జిల్లాలో లేడు. అమర నాథ్‌కు గాయంతగిలిందంటే ఎవరూ విశ్వసించరు. చాటు చాటున ఏంజరిగిందో తెలియదు. పైగా ఈ దుర్ఘటన మన సంతలోనే జరిగింది."

రేగారికి భోజనంమీద ఇష్టం తప్పిపోయింది. ఆలేఖ్య ముఖం వాల్చుకుని ఏదో తింటున్నట్లు నటిస్తోంది. పదిపదిహేను నిమిషాలక్రితం డిన్నర్ ఎంతో మజాగా సాగుతూవుండె. అదంతా ఈ నూతనవ్యక్తి ఆగమనంతో భగ్నమైపోయింది. అతడొక విలక్షణ పురుషుడు. ముక్తసరిగా మాట్లాడతాడు. అచ్చమైన హిందువులా కనిపిస్తున్నాడు. ముఖవైఖరి గంభీరంగా వుంటుంది. నిరాడంబర వేషభాషలు అతని వైశిష్టతను సూచిస్తున్నాయి. ఎక్కడ దెబ్బలాడి వస్తున్నాడో! పోలీసులను ఎదిరించటంకూడా ఒకరకమైన ప్రతిష్ఠే. రే మహాశయుడు ఉబ్బి తబ్బిబ్బయి అతన్ని ఎందుకంతగా పొగుడుతున్నాడో ఇందుకుగాని ఆమె సోదరునికిగాని అర్థంకాలేదు చివరకు ఇందు అడిగింది: "అతడు ఎవరు ఆలో?"

రేగారు అందుకుని చెప్పారు: ఆయన ఇక్కడొక పాఠశాలలో అధ్యాపకుడు. ఉపాధ్యాయ వృత్తికి ఇప్పుడంత గౌరవం లేకుండాపోయిందనుకో. అయినా పాఠశాలలున్నాయి; అధ్యాపకులూవున్నారు. అయితే పాఠాలు నేర్పటమే అమర నాథుని విశేషత కాదు. దేశసేవ. అదికూడాకాదు. అతనిలోని విశిష్టత."

"మరేమిటి అతనిలోని విశేషం?" ఇందు అడిగింది.

"ఏం చెప్పమంటావమ్మా! అతన్ని నేను పూర్తిగా అర్థం చేసుకోలేను. అయినా అతని విషయంలో నేను ఒక్క మాట నిస్సందేహంగా చెప్పగలను: బ్రతికి బాగుంటే మున్ముందు అమరనాథ్ ప్రత్యేకతను దేశంయావత్తూ గుర్తించి తీరుతుంది."

ముందెన్నడో ఏదో జరుగుతుందని జోస్యాలు చెప్పితే ప్రయోజనం ఏమిటి? అయినా రేగారు ముసలివారు. ఇందుమ రేమీ మాట్లాడలేదు. కమలకిరణ్ మాత్రం మౌనంగా ఉండలేకపోయాడు. అడిగేశాడు: "మిష్టర్ రేగారు! మీ ఎస్టేటు ప్రజల్లో విప్లవం లేవదీస్తున్న వ్యక్తి ఇతడే కదూ!"

"ఔను" రేగారు అంగీకరిస్తూ తల ఊపారు.

"మీ సంతకతడెందుకు రావాలి? అందుకోసమే వచ్చాడా?"

రేగారు నవ్వారు. నవ్వుతూనే చెప్పారు: "విదేశీ వస్తువుల్ని ఎవరూ కొనకుండా ఆపటానికి"

"అంటే సహాయ నిరాకరణోద్యమానికి చెందిన వ్యక్తి అన్నమాట. వర్తకులాయనపని పట్టించి వుంటారు. అంతేనా మిష్టర్ రేగారు!"

"అంతే కావచ్చు. వర్తకులు మున్ముందుగానే పోలీసులకు కబురు చేసి ఉంటారు"

ఇంతవరకూ మౌనంగా నేడున్న ఆత్రేఖ్య అప్పుడు చెప్పింది "నేనే పోలీసు మద్దతుకోరుతూ మేజిస్ట్రేటుకు ఉత్తరం రాశాను"

"భేష్. మంచిపనిచేశావు నువ్వు. ఆ సంత నాదే అయినట్టయితే అధ్యాపకమహాశయుని విడిచి పెట్టేవాణ్ణి కాదు" అన్నాడు కమలకిరణ్ తీవ్రంగా.

రే ఏదో మాట్లాడేవారే. కాని అలనాటి హర్తాళ్ జ్ఞాప కం వచ్చింది. ప్రజలు గోడ్డుమీద ఘోష్ బాబు కారును అడ్డగించి గాజుపలక బద్దలు కొట్టేశారు. ఆయన క్షమాశీలి కాదు; చాలమందిని జైల్లో పెట్టించాడు.

కాసేపు ఊరుకుని రేగారు అన్నారు: "కమల్! ఫిర్యాదు చెయ్యటంవల్ల లాభంకంటే నష్టమేఎక్కువ. రేపుగాని ఎల్లుండిగాని మనతరఫున ఎవరైనా సంతకుపోవాలి. వ్యవహారం మనం అనుకున్నంత తేలిగ్గా పరిష్కారంకాదు. అసలు పోలీసులు రాకండానే ఉంటే వ్యవహారం ఇంత ముదిరేదేకాదు."

ఇందు అడ్డం వచ్చి ప్రశ్నించింది: మేజస్ట్రేటుకు కబురు పంపినప్పుడు మీతో చెప్ప లేదా?"

అప్పుడు రేగారు కూతురువైపు చూచారు. ఆమె ముఖం వంచుకుని కూర్చుంది. రేగారు అన్నారు: "నాతో చెప్పాల్సిన అవసరం ఏముంది ఇందూ! ఎస్టేటు వ్యవహారాల బాధ్యత నాభుజాల మీదినించి దించేసుకున్నానని మీకు తెలి యదా? నిర్వహణ అంతా ఆలేఖ్యదే. అన్ని వ్యవహారాలు ఇప్పుడామె చూస్తున్నది. ఏదైనా పొరపాటు జరిగినా దాన్ని సరిదిద్దవలసిన బాధ్యత కూడా ఆమెదే."

కమల్ ఆశ్చర్యపోయాడు. "మీరు జీవించి ఉండగానే అలా చేస్తే యెలా?"

రేగారు నవ్వారు: "నేను జీవించిలేనే అనుకోవాలి"

అలాఅనుకోవటం అసంభవం. ఆలేఖ్యలాంటి చిన్నపిల్లకు ఈ భారం మోయటం చాల కష్టం"

"అడుగడుగునా ఏదో పొరపాటు వస్తూనే ఉంటుంది" అన్నది ఇందూ.

"పొరపాటుకు శిక్షఉంటుంది. అపరాధం చేసినప్పుడు దండన స్వీకరించాల్సిందే" అన్నారు రేగారు.

"పైగా చుట్టుపక్కలంతా దుష్టులు, దుర్మార్గులు" అన్నది ఇందు.

"చుట్టుపక్కల శత్రువులే కాదు; మిత్రులూ ఉంటారు ఇందూ! ఇక్కట్లులనించి తప్పుకునే ఉపాయాలూ వాళ్లే చెబుతారు. తాను ఒక్కడే కూతుర్ని స్వాధీనంలో చక్కబెడుతూ ఉండేశక్తి తండ్రికి లేదు" అన్నారు రేగారు.

ఇందు ఆమాటలోని తర్కాన్ని గ్రహించింది. కమల్ కూడా ఆమాటల్లోనే తనకై యిమిడి వున్న జవాబును గ్రహించి ఊరుకున్నాడు.

మర్నాడు ఉదయం అమరనాథ్ వచ్చాడు.

అప్పటికందరూ ఫలహారాలై హాల్లో కూర్చుని ఉన్నారు అమరనాథ్ అక్కడికే వచ్చి కూర్చున్నాడు.

"నిన్న నీమీద చెయిచేసుకున్న దెవరు?" అని రేగారు మొట్టమొదటగా అడిగిన ప్రశ్న.

"తెలుసుకుని ఏంజేస్తారు మీరు" అమరనాథ్ ప్రతి ప్రశ్న వేశాడు.

"ఇటువంటి అన్యాయం సహించి ఊరుకోకూడదు. ప్రతీకారం చేసితీరాలి" అన్నారు రేగారు.

"కాని మీరు ఎస్టేటు వ్యవహారాలనించి దూరంగా వున్నారుగా!"

కాని బాధ్యత వహిస్తున్న వ్యక్తి ఏదో పరిష్కారం చెయ్యాలిగా!"

తండ్రిగారి ఊహకూతురు తెలుసుకుంది. గంగూలీ ఆత్మహత్య జరిగిన తర్వాత ఆమె తన ముఖం ఎవరికీ చూపించటంలేదు ఎవరన్నా చూడ్డానికివస్తే వాళ్ళతో ఎక్కువగా మాట్లాడదు. ఆదుర్ఘటనకు తానే బాధ్యురాలనని వాళ్ళంతా భావిస్తుంటారు. ఆవిషయమై వాళ్ళు ఏమేమి కఠినవాక్యాలు విసురుతారో ! తనకు సిగ్గుకాదూ ! ఎలా సహించగలదు.

"నేనడుగుతున్నాను. చెప్పాల్సిందే. ఆ దుండగీడెవ్వరు?" ఆలేఖ్య అమరనాథ్‌ను అడిగింది.

ఆ దుర్ఘటన జరిగినతర్వాత ఆలేఖ్య ఎదుటి మనిషిని తలెత్తిచూడటం అదే ప్రథమం. శాంతిపూర్ణము, ఉదాసీనము అయిన అతని ముఖమండలాన్ని క్షణమాత్రం చూచింది. చివరకు అతడన్నాడు. "వాళ్ళంతా మీ ప్రజలు. వారెవరో తెలుసుకోవాలని కేవలం కుతూహలం మాత్రమే అయితే - ఆ కుతూహలాన్ని మీరు అణచుకోవటమే మంచిది."

"వాళ్ళు నా రైతులు కాబట్టే అడుగుతున్నాను. లేకపోతే ఎందుకడుగుతాను. ఎస్టేటుదారుకుకూడా కర్తవ్యం అంటూవుంది. మీ యెడల ఈ అన్యాయం చేసినవాడిని శిక్షిస్తాను."

"మీరు అతన్ని దండిస్తారు. కాని అది ప్రతీకారం కాజాలదు"

"అన్యాయానికి ప్రతీకారం దండనే"

అమరనాథ్ మందహాసం చేశాడు: "మీతో చర్చకు దిగటం నాకిష్టంలేదు. ఒక జమీందారీ రైతుచేసిన అన్యాయానికి మీరేవిధంగా ప్రతీకారం నెరపుతారో నాకు బాగా తెలుసు

కాని అన్యాయము వేరు, అజ్ఞానం వేరు. రెండూ ఒకటి కాదు. శాసనం, దండన - ఈ రెంటిద్వారా ప్రతీకారం అసంభవం."

కాసేపు ఆగి అమరనాథ్ ఇంకా ఇలా చెప్పాడు: "వాడు నన్ను దెబ్బకొట్టాడే అనుకుందాము. అయినా సర్కారువారి చేత వాణ్ణి శిక్షించటంవల్ల ప్రయోజనం ఏమిటి? దెబ్బలు కొట్టటంమాట అలా పెట్టండి - దానికే నేను ప్రాముఖ్యత ఇచ్చేట్టయితే అసలు నేనక్కడికి ఎందుకు వెడతాను? నన్ను కొట్టిన వాడిమీద మీరేమీ ఏక్షన్ తీసుకోవద్దు. అదే మీరు నా యెడల చూపించగల పెద్ద సానుభూతి" అంటూ వెళ్ళిపోడానికి లేచాడు.

౩

"ఈ విషయమై మీ అభిప్రాయం ఏమిటి?" రేగారు కమలకిరణ్ వైపు తిరిగి అడిగారు.

కమలకిరణ్ గుడ్లు మిటకరించి ఇందు వైపు, ఆలేఖ్య వైపు, రేగారివైపు చూచాడు.

వెళ్ళిపోవటానికి లేచిన అమరనాథ్ నిల్చుండి పోయాడు. ఇదివరకన్న మాటలకు ఉపసంహార రూపంలో మళ్ళీ ఇలా అన్నాడు: "ఎస్టేటు మీది. ఇక్కడి మంచిచెడ్డల భారం మీది. మీరేమిచేసినా నేను కారణంగా మాత్రం చెయ్యొద్దు. అదే నేను మిమ్మల్ని ప్రార్థించేది."

రేగారు ఆతృతగా "ఎబ్బెబ్బె! ఎప్పుడేనా జరిగిందా అలాగా? అయినా నీకిష్టం లేనప్పుడు" అర్థోక్తిలో ఆగి ఆడ పిల్లలవైపు తిరిగి అన్నాడు; "మీ అభిప్రాయం ఏమిటి ఇందూ! ఏమంటావు ఆలో!"

ఈ ప్రశ్న ఇతర్లను అడుగుతున్నా రేగారు నిజానికి తన్నే ప్రశ్నించుకుంటున్నాడు. ఇందు తల ఊపింది. అలాగే కమల్ కూడా తల ఊపనున్నారు. మరి ఆలేఖ్య? గంగూలీ మరణించిన నాటినించీ ఆమె తల వంచుకునేవుంటోంది. తన అభిప్రాయం ఏమని చెబుతుంది? ముఖమెత్తి చూడ్డానికి ఆమెకు సంకోచంగాఉంది. కాని ఆమె తక్షణమే జవాబు చెప్పింది. మొదటిరోజు అమరనాథ్‌ను చూచినప్పుడామెకు అతనంటే మంచి అభిప్రాయం కలగలేదు. తరువాత క్రమశః ఆదురభిప్రాయిం తగ్గలేదు. సరిగదా వృద్ధిచెందింది. గంగూలీ చనిపోయిన నాటిసాయంత్రం అమరనాథ్ వచ్చాడు. కాని అతను చూపిన సానుభూతి ఏమీలేదు. అతని సమక్షంలో తాను లజ్జ, గ్లాని అనుభవించింది. అతని యెదుట తానెప్పుడూ ఒక అపరాధినన్న భావం స్ఫురిస్తూ వుంటుంది. నేడు తన మిత్ర బృందం సమక్షంలో తన పూర్వపు వ్యక్తిత్వం తిరిగి పొందినట్టుంది. మామూలుగా తలెత్తిసహజ శాంత స్వరాన ఆమె అన్నది.

"హంగామా చేసేది మీరు. ఇక్కట్లు అనుభవించేది మేము. ఏం మాటలండీ!"

"(ఎక్కట్లె) నేనూ అదేమాట చెప్పాలనుకుంటున్నాను" అన్నాడు ఉల్లాసంగా కమలకిరణ్. అమరనాథ్ వెళ్ళబోతున్న వాడల్లా చటుక్కున ఆగిపోయాడు. ఆలేఖ్య ఇంకా చెబుతూనే వుంది: "మీ యిల్లెక్కడ? మాసంత ఎక్కడ? మీరెక్కడి కేమీ పనిమీద వెళ్ళారు? బుద్ధిపూర్వకంగా కల్లోలం తెచ్చారు. అందువల్ల దేశానికి మంచి ఒకగూడుతుందో, చెడే

దాపురిస్తుందో భగవంతుడికి తెలుసు. పోనీ మంచెడినగూడు తుందను కుందాం. ఈయేస్టేటునాది. దీని మంచిచెడ్డలతో నాకేమి సంబంధంలేదూ? నువు కారణంగా మేము ఏమీ చేయవద్దని శాసించేందుకు వచ్చారా? ఉద్దేశాలకు కూడా ఒక విలువ అంటూ వుంటుందని మీకు తెలుసా? అమరనాథ బాబూ! మీరు ఈవిధంగా విరోధించటం చాల అనుచితం.''

ఆలేఖ్య నోటివెంట ఇలాంటి ప్రసంగం వస్తుందని ఎవరూ అనుకోలేదు. అమరనాథే కాదు, అక్కడ ఉన్నవారంతా ఆశ్చర్య"పోయారు. రేగారుకి అందరికంటే ఎక్కువగా ఆశ్చ ర్యం కలిగింది.

విస్మయ చిత్తుడై అమరనాథ్ ఆలేఖ్య ముఖంలోకి చూస్తూ నిల్చున్నాడు. తగిన జవాబు తోచలేదు పాపం!

రేగారు ఏదో మాట్లాడాలనుకుంటూ మొదలుపెట్టారు. "ఊహుఁ. అదికాదు సంగతి. నీకేం తెలుసూ? అమరనాద్'' ఆగిపోయాడు.

"ఊరుకున్నావేం నాన్నా! చెప్పు''

ఇందు కమలకిరన్ నవ్వుతున్నారు రేగారు చూడకుండా.

అమరనాద్ స్వాభిమానం దెబ్బతిన్నది. అన్నాడు. "ఔనౌను. నా శాసనాన్ని మన్నించవలసిన అవసరం మీకే ముంది?"

"మన్నించనని కాదు నేనన్నది. ఉచితంగాని, అనుచితం గాని నా ప్రజలకు మీమీద కోపం ఇంకా రెచ్చిపోకుండా ఉండాలని మీరు ఈ విధంగా శాసించటం బాగులేదన్నాను" అన్నది ఆలేఖ్య.

"మిమ్మల్ని శాసిద్దాం అన్న ఉద్దేశంతో నేనిక్కడికి రాలేదు. నన్ను కొట్టినవాణ్ణి మీరు శిక్షించినందువల్ల ప్రయోజనంలేదు అనిమాత్రం చెప్పటానికి వచ్చాను.

"మీకు నిష్ప్రయోజనం అని తోచినవిషయం రైతులకూ, ఎస్టేటుదారుకూ కూడా నిష్ప్రయోజనంగానే తోస్తుందని అనుకోటం పొరపాటు. ప్రయోజనమో, నిష్ప్రయోజనమో - ఆ బాధ్యత మాకే విడిచిపెట్టండి" అన్నది ఆలేఖ్య.

దానికి కమలకిరణ్ కూడా తలఊపుతూ వంతపలికాడు' "నిజమే. ఈ బాధ్యత మాది. ఈ భారం మేమే వహిస్తాం' మూడో వ్యక్తి ఒకడు మధ్యలో కలుగజేసుకో వలసిన అవసరం ఏముందీ? ఏం? మిష్టర్ రేగారు! మాట్లాడరేం?"

రేగారు అందరి ముఖలక్షణాలు పరికించాడు. నిన్ననే కదా ఆలేఖ్య వంగదేశంలోని బీదప్రజల దుస్థితులను తలచుకుని విచారపడది. అమరనాధ్ స్వార్థంకోసంగాక ఆ దరిద్రపు ప్రజలకోసమే పాటుపడుతున్నాడనీ ఆలేఖ్యకు తెలుసు. అమరనాధ్ దెబ్బలు తినికూడా ప్రతీకారం వద్దంటున్నాడు. ప్రజల మంచి కోసమే పాటుపడుతున్నాడు. ఇటువంటి సహనశీలుని యెడ ఆలేఖ్య ఇలా ప్రవర్తిస్తున్నదేమిటి? ఆమె చూపిన కోపతాపాలకు హేతువు కనిపించటంలేదు. రేగారు కొంచెం ముందుకు వంగి అన్నారు: "ఇదంతా చాలవరకు మామూలు వివాదమే కమల్! ఇందులో కోపం తెచ్చుకోవలసిన అవసరం ఏముంది ఆలో! ఏమిచేయటం మంచిదో - ఏమిచేస్తే పొరపాటు ఔతుందో-స్థిమితంగా ఆలోచించుకోవాలి. అమరనాధ్! ఈ సంగతి రేపు ఆలోచించ వచ్చులే"

"రాయ్‌వహాశయా! ఇద్దరికి సంబంధించిన వ్యవహా రంలో మూడోవాడు కల్పించుకోటం మంచిదని ఎవరంటారు! ఎస్టేటుదారు, రైతులు ఇవి రెండే రెండు పక్షాలయితే చెప్పే దేముంది! మూడోపక్షం కూడా వుందిమరి, ఈ యిబ్బందు లన్నింటికీ మూలం. ఎవరికి యిష్టంవున్నా, ఎవరికి యిష్టం లేక పోయినా ఈ మూడోపక్షం వుంటుంది మరి. దాన్ని మాపు చెయ్యలేం. ఇంతటి చిన్నవిషయం కూడా ఈబాబుగారి బుర్రకు తట్టకపోతే' అన్నాడు అమరనాద్ ఒక చిరునవ్వు నవ్వటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ.

ఆమాట ఆలేఖ్య మొదలైనవారికి తట్టకపోలేదు. కాని అమరనాథ్ మాటల్లోని తీవ్రత ఊరికేపోలేదు. ఆలేఖ్యకు చాల కోపంవచ్చి అన్నది: "ఇంగ్లీషులో బిజీబాడీ (వ్యస్తప్రాణి) అని ఒక పదం వుంది. ప్రపంచంలో అటువంటివాళ్లు అసంఖ్యాకంగా వుండటం దౌర్భాగ్యం. వాళ్ళ మూలానే నాన్నగారు ఇక్కడికి పరుగెత్తుకు రావలసి వచ్చింది. పిలవనిపేరంటంగా వచ్చేవాళ్ళం దరితో మాటాడ్డానికి నాకు భిడియంగా వుంటుంది. వాళ్ళలో కూడా అటువంటి భిడియం వుండవద్దూ? లేకపోతే నా కర్తవ్యం నేను నిర్వహించాల్సిందే."

కూతురు మాటలకు తండ్రి హృదయం క్షోభించింది. తన్ను తాను నిగ్రహించుకుంటూ అన్నాడు: "ఏనేం కని పించటంలేదు. మాటలు మాత్రం చురుగ్గా వస్తున్నాయి. అమ్మా! అమరనాథ్ ఇప్పుడే వచ్చాడు మనింటికి..."

"అమరనాథబాబు భ్రాంతిమంతుడు. నేను చెప్పాల్సిం దంతా నా యింట్లోనేకాకపోతే మరోచోటికి వెళ్ళి చెబు

తానా! చెయ్యదలచిన అపరాధం పూర్తిగా చెయ్యనీయండి. అమరనాద్ బాబు క్షమిస్తాడు. శిక్షణలో, రీతిలో, నీతిలో, సంస్కారంలో నాకూ అమరనాద్‌కూ చాల తేడావుంది. అందువల్లనే అతడు నా ప్రజల్లో విప్లవం రగిల్చేట్టయితే అది చాల అన్యాయం——" అన్నది ఆలేఖ్య.

దానికి అమరనాద్ ఇలా జవాబు చెప్పాడు: "ఒక పని చేస్తూన్నప్పుడు ప్రతివానికీ ఒక ఆశయం వుంటుంది. నాకూ వుంటుంది, మీకూ వుంటుంది. కాని మీ ఆశయం ఏమిటో గ్రహించటానికి నాకు అవకాశం చిక్కలేదు, ఊహించగల కల్పనాశక్తి లేదు."

"మా ఆత్మరక్షణకోసం మేము ఏమన్నా చేసేట్టయితే మీరు ఏమనుకుంటారు" ఆలేఖ్య అడిగింది.

రేగారు రెండు చేతులూ ఎత్తారు. హృదయంలోని క్షోభ వ్యక్తమౌతున్న కంఠస్వరంతో "వద్దు, అమరనాథ్, నువ్వు దానికి జవాబేమీ చెప్పవద్దు" అంటూ లేచి అమరనాథుని ఇవతలకు తీసుకొచ్చాడు. మెట్లదగ్గరకు వచ్చి ఇద్దరూ ఆగారు. రేగారు అమరనాథుని చెయిపట్టుకుని అన్నారు: "ఇవాళ నా ఆశ్చర్యానికి మేరలేకుండా వుంది అమరనాద్."

"ఎందుకూ? విషయం ఆమెకు అవగాహన కాలేదు."

"ఆశ్చర్యమేకాదు, నేను చాల విచారిస్తున్నాను."

రేగారిముఖంలో వేదన స్పష్టంగా కనిపిస్తున్నది. అమరనాథ్ అన్నాడు: "విచారమెందుకు మహాశయా? ఆమెకూ నాకూ మనోవృత్తులలోగల ఈ మహాదంతరం సహజమే. నే నేమీ చెప్పకుండా ఉంటేనే బాగుండేది. కాని ఎస్టేటు అధి

కారిణి ఇప్పుడు ఆమే. కాబట్టి బదులుచెప్పక తప్పలేదు. మీ సమక్షంలో కొంచెం కఠినంగా మాట్లాడివుంటాను. క్షమించండి. మీరు క్షమిస్తే నా మనస్సు శాంతంగా వుంటుంది."

"క్షమాభిక్ష దేనికి అమరనా. నే నెరిగినంతవరకు నీ తప్పేమీ లేదు. తప్పు మరొకవైపునే వుంది."

శేగారి మాటలు అమరనాథ్‌కు బాగా అర్థంకాలేదు. చాల ఆలస్యం అయింది. అమరనాథ్‌కు తీరికలేదు. ఇంకావుండి మాటాడ్డానికి కోరికలేదు. "నాపని ఇప్పుడు కష్టతరమే ఐంది. అయినా గత్యంతరంలేదు. ఆదిలో నేను పూనిన వ్రతాన్ని నిర్వహించుకుపోటమే నా జీవితకార్యక్రమము" అంటూ నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

శేతిరిగివచ్చాక ఆలేఖ్య అన్నది: "నువు ఉన్నన్నాళ్ళూ ఈ ఎస్టేటు అధికారిది నువే నాన్నా నేనుకాదు. భవిష్యత్తు మాట ఎవరెరుగుదురు? బుర్ర ఉపయోగించకుండా పనిచెయ్య గలను. అని ధైర్యం తోచినప్పుడు నేనీబాధ్యత వహించ గలుగుతాను. కాసేపు ఇక్కడ. కాసేపు అక్కడ, కాసేపు ఇది, కాసేపుఅది నేనీ గొడవపడలేను. ఏమైనాగానీ, పూర్వం నించీ ఎలానడుస్తున్నదో ఇప్పుడూ అలాగే నడుస్తుందిలే. నా కెందుకు?"

తండ్రి జవాబేమీ చెప్పలేదు. మాటాడకుండా కూచు న్నాడు. ఈ మౌనంలోని భావం ఎవరికీ అర్థంకాలేదు. ఆలేఖ్య మాత్రం గ్రహించింది. ఇక ఉండబట్టలేక పోయింది. "నాన్నా నీ మాటలు. చేతలు ఎలా ఉన్నాయంటే వాటి చాటున అనేకమంది నేరస్థులకు కూడా శరణు దొరుకుతోంది. అది

నువ్వు గ్రహించలేదేమో. నాకు మాత్రం కాలం కష్టంగా తెలిసిపోయింది"

ఆలేఖ్య చేసిన అభియోగాన్ని తండ్రి ఖండించలేదు. పూర్వంవలెనే మౌనముద్రలో ఉన్నాడు. ఆయిద్దరు అతిథులు కూడా మౌనంగానే ఉన్నారు. తండ్రికూతుళ్ళ వ్యవహారంలో తాము జోక్యం కలిగించుకుని మాటాడ్డం శిష్టతా విరుద్ధం అని వారికి తోచింది. కానివారి ముఖలక్షణాలు ఆలేఖ్య అభిప్రాయాల్ని సమర్థిస్తున్నట్టుగా ఉన్నాయి అదిచూచి ఆలేఖ్య ఆవేశం ద్విగుణీకృతంఅయింది. తండ్రి ముఖంలోకి చూపులు గుచ్చుతూ అన్నది "దేశంలో ఈ వీస్తున్న ఝంఝూనిలం ఏమిటి నాన్నా! ఈ యువకులంతా తమతమ పనిపాటలు వొదిలిపెట్టేసి నిస్వార్థ పరోపకారానికంటూ ఊరేగుతున్నారు. బుద్ధుడు, ఏసుక్రీస్తుబాంటివాళ్ళే తాముూ అని భావిస్తున్నారు. ఒకచెంపమీద దెబ్బతిని మరోచెంపకూడా చూపించటానికి తయారుగా ఉన్నారు. చెంపలు వాళ్ళవి, సహనశీలురు వాళ్ళు మనకిందులో వచ్చేదేమిటి? పోయేదేమిటి? కాని ఆసిద్ధాంతంమీద నిల్చుని ఇతర్ల ఎస్టేటుతో ఆటలాడతాగా వాళ్ళు? ఆస్తిపాస్తులుఉన్నవాళ్ళకు కష్టాలు కలిగిస్తే దరిద్రులకు లాభంచేకూరుతుందా? ఇటువంటి నిశ్చయం ఈ పరోపకారాల మస్తిష్కంలో ఎలా వచ్చిచేరిందో బోధపడటంలేదు."

కమలకిరణ్ ఇక ఊరుకొండలేక పోయాడు: అన్నాడు. "ఆనాడు ఏం జరిగిందో చూడలేదూ? నాన్నగారి మోటారు

విండ్ స్క్రీన్ ముక్కలు ముక్కలు చేశారు ఈ ఉపద్రవ కారులే"

"ఔనౌను. అటువంటి దుర్మార్గులకు ప్రతిక్రియ చేయ వలసిందే" అన్నది ఆలేఖ్య.

"మా నాన్నగారి ఉద్దేశమూ అదే" అన్నాడు కమల కిరణ్.

"మా నాన్నగారి ఉద్దేశంమాత్రం దానికి పూర్తిగా వ్యతిరేకం" ఆలేఖ్య కంఠస్వరం తీక్షణతరం అయింది "నాన్నా నీవు తెలియని వాడివి కాదు. అన్నీ ఆలోచించగలవు అయినా ఇంతవరకూ ఎస్టేటు వ్యవహారాలే పట్టించుకున్నావు కాదు. ఇప్పుడు ఇక్కడి పరిపాలనా విధానం అంతా పాడైపోయింది. గడబిడగాఉంది. ఈబూజుపట్టిన వ్యవహారాలన్నీ నేను సరిచేస్తూ ఉన్నప్పుడు ఎవడో ఆత్మహత్య చేసుకుని చస్తే అది నా తప్పా? అందరూ ఆ తప్పు నా తలమీదే వేసి మాట్లాడతారు. వద్దు నాన్నా వద్దు. నావల్ల ఏమీ పాడుగానక్కర్లేదు. నా ముఖం ఎవరికీ చూపించే స్థితిలో లేను. వద్దు నాన్నా! నువ్వే సరి దిద్దుకో. ఇప్పటికే చాల తప్పులు అయ్యాయి. అధికారం నాకు వొప్పచెప్పేట్టయితే పూర్తిగా వొప్పజెప్పు లేకపోతే అక్కర్లే లేదు. ఎక్కడనుంచి వచ్చామో, అక్కడికే పోదాం."

ఆమె చేస్తున్న అభియోగం, ఆక్రోశం, రేగారు గ్రహించారు. మిక్కిలి ఆశ్చర్యసూచకంగా కూతురు ముఖంలోకి చూస్తూ అన్నాడు. "కాని అమ్మా! అమరనాధ్ మాత్రం అటువంటి మనిషి కాదు. అతని మాటలద్వారా నేను గ్రహించిందేమంటే___"

అగ్రోక్తిలో కమలకిరణ్ అనుకున్నాడు: "ఏమైనా ఈ తాలూకాలో అతడూ ఒక మనిషే—చదువురాని మూఢులైన యీ గ్రామీణులమధ్య - ఏమంటావు ఇందూ?" అంటూ వాక్యం అసమాప్తంగానే ముగించాడు.

కమలకిరణ్ వాక్యాన్ని, అతని భావాన్ని సమర్థించటానికి ఆలేఖ్య ఏమీ మాట్లాడలేకపోయింది. అమరనాద్ ఒక పల్లెటూరి బ్రాహ్మణుడని తేలిగ్గా అనేస్తే అనేయవచ్చు. కాని అశిక్షితుడనటానికి వీల్లేదు. బాగా చదువుకున్నాడు. విద్యార్థికుడన్న ముద్ర, ట్రేడ్‌మార్కు అతనికి లేదంటానికి వీలులేదు. సభ్యసమాజంలో మాట చలామణీ అయ్యేవారికుండే కీర్తి అతనికీ వుంది. ఆ సంగతి ఆలేఖ్యకు తెలుసు. మరో సంగతి: గంగూలీ ఆత్మహత్యను పురస్కరించుకుని గ్రామ ప్రజలు ఏమైనా చేసివుండవచ్చు. అమరనాద్‌మాత్రం ఏమీ చెయ్యలేదు. ఆ సంగతి అమరనాథ్ స్వయంగా చెప్పాడు, ఇతర్లవల్ల కూడా తెలిసింది. గంగూలీకి, అతని కుటుంబానికీ అమరనాద్ చాల సహాయం చేసివున్నాడు. ఆలేఖ్యను గురించి ప్రజలు చేస్తున్న విషప్రచారాన్ని అడ్డగించటానికి అతడు చాల శ్రమపడ్డాడు. అదంతా సత్యమే — ఈ విషయాలన్నీ ఆలేఖ్యకు తెలుసు. అయినా గంగానది వెనక్కు ప్రవహిస్తోంది. అమరనాద్ దుష్టుడు, నేరస్తుడు అని నిర్ణయించటానికి వారంతా పట్టుపట్టినట్టుంది. ఆలేఖ్యకు కోపం బాగా రగిలింది. అమరనాద్ అక్కడ లేకపోయినాకూడా అతనిపై నేరాలు ఆరోపించే ప్రయత్నాలను ఆమె ఖండించలేదు.

రేగారు చాల విచారపడ్డారు. కాని ఒక్క కటువైన మాటకూడా అనలేదు, చివరకు తల గోక్కుంటూ అన్నాడు: "అమరనాద్ సాధారణతః చాల మంచివాడు."

"సాధారణంగా అందరూ మంచివాళ్లే. ఇతర్ల మోటారు గాజుపలకను మరొకరు ఎందుకు పగలగొడతారు?" అన్నాడు కమలకిరణ్

"ఊఁ" అని ఊరుకున్నారు రేగారు.

"ఆలేఖ్య చెబుతూన్న మాటల్ని మనం గమనించాలి. వీళ్ళ పరోపకారానికి - అంటే ఇతర్లకు హానిచేకూర్చే కార్యక్రమాన్ని ఉపేక్షించరాదు. ప్రతీకారం చెయ్యాల్సిందే—" అన్నాడు కమలకిరణ్.

"అవసరమైతే చెయ్యాల్సిందే" అన్నారు రేగారు అన్యమనస్కులై.

"ఒకమాట చెబుతాను మిస్టర్ రేగారు! క్షమించాలి. ఎస్టేటు అంటే మీరు మరొక రకంగా భావిస్తున్నారు. పెద్దపెద్ద ఎస్టేట్లతోనే నాకు సంబంధం ఉంది. అన్నిచోట్లా నాకొక సంగతి కనిపించింది: ఎస్టేటు దారుకూ రైతులకూ మధ్య విద్రోహం పెంపుచేయటమే కొందరు దేశభక్తుల నిత్యవృత్తి. దీనికి బోల్షివిక్ ప్రాపగాండా మూలం. దానికి సంబంధించిన వాళ్ళంతా వెనుక ప్రోత్సాహం ఇస్తుంటారు. నేను నిజం చెబుతున్నాను మిస్టర్ రేగారు! ఈ విప్లవ ప్రయత్నాలకు సంబంధించిన అనేక రహస్యాల్ని ప్రభుత్వం సేకరించింది. మనం కలలోకూడా ఊహించిఉండం; అటువంటి విషయాలు అవన్నీని. చాల జాగ్రతగా ఉండాలి. కొంచెం ఏమరుపాటుగా ఉన్నామంటేచాలు ఎస్టేటుకు నీళ్లు వొదులుకోవలసిందే"

ఇలా చెబుతున్న కమలకిరణ్ ముఖం పాలిపోయింది విప్లవ పరిస్థితులూ తలపుకు వచ్చేసరికి ఇందువైపు, ఆలేఖ్యవైపు చూస్తూ కూర్చున్నాడు. అసలైన ఎస్టేటు దాతుముఖంలో మాత్రం ఎట్టి భయచిహ్నమూ పొడచూపలేదు. శాంతంగా చెప్పాడు: భారతేతరదేశాల పరిస్థితులు నేనెరగను. మన వంగ దేశస్థితిగతులు వేరు. ఇక్కడి పాలకపాలితుల పరస్పర సంబంధం మరోకలా ఉంటుంది కమల్! మీరు భయపడి, ఇతర్లను భయ పెట్టవలసిన అవసరం లేదు."

"పాతిక సంవత్సరాలక్రితం మీరనుకున్నట్టుగా స్థితి గతులు ఉండేవేమో. ఇప్పుడంతా మారిపోలేదూ!" కమల్ కిరణ్ వాదించాడు.

"మారలేదని నేను చెప్పలేదే" అన్నాడు రేగారు.

"ఈమారిన స్థితినిబట్టే భయపడాల్సివస్తోంది" అన్నాడు కమల్.

రేగారు చిరునవ్వు నవ్వారు. "ప్రజల మనస్థితిలో మార్పు వచ్చింది. అది వారి విజ్ఞానపరిణామం కావచ్చు, యుగ ధర్మం కావచ్చు, జమీందార్లు చేస్తూవచ్చిన అత్యాచారాల ఫలితం కావచ్చు. జమీందారీలు నశించాలని ప్రజలు కోరు తున్నారు. నేడో రేపో అవి పోయేవే. జమీందార్లు సెలవు పుచ్చుకోక తప్పదు. నువు ఎలాగూ వాటిని కాపాడుకోలేవు. మా ఎస్టేటుమాట చెబుతా వినండి: మేము ప్రజల్ని నిజంగా ప్రేమించాం. నే నెప్పుడూ వారిపై ఎట్టి అత్యాచారమూ చెయ్యలేదు. పోలీసులను పిలిపించిగాని, నా ఉద్యోగులచేత గాని వారిపై ఎప్పుడూ జబర్దస్తీచేసి యెరుగను. ఎవరినైనా

అడిగి తెలుసుకోండి. ఇకముందు ఆలోకూడా నా పద్ధతుల లోనే నడిస్తే భయపడాల్సిన అవసరం ఉండదు—అరె, చాల ప్రొద్దెక్కిందే!"

ఇంత సేపటినుంచీ మౌనంగా నేవున్న ఆలేఖ్య తండ్రి లేవటంచూచి అన్నది. "ఆమాట నన్ను ఉద్దేశించే చెప్పావా నాన్నా!"

రేగారు నవ్వారు. "నీపేరుకూడా సూచించే అన్నా నుగా!"

"నాన్నా! రైతులు మన కివ్వాల్సిన శిస్తులు ఇవ్వక పోతే నువు వాళ్ళను ఎన్నోసార్లు క్షమించి విడిచిపెట్టేశావు, జ్ఞాపకం వుందా?"

"ఎందుకు జ్ఞాపకంలేదు?"

"నన్నుకూడా అటువంటి అన్యాయమే చెయ్యమం టావా?"

రేగారు నవ్వారు. స్నేహపిచ్ఛిలంగా చెప్పాడు. "నీకు లభ్యమౌతున్న సొమ్ము అంతా అన్నివిధాలా న్యాయంగానే లభ్యపడుతున్నట్టు భావించరాదు. భూమిశిస్తు వాళ్ళు నీకు చెల్లిస్తున్నారు. అంతమాత్రాన దాన్ని నీవు గ్రహించటంకూడా ఉచితమే నని స్థిరపరచు కోటానికి వీల్లేదు. కొన్నికారణాలచేత అస్తు నేను తీసుకోవటం అను చితమని తోచినప్పుడు విడి చిపెట్టే శాను"

కమలకిరణ్ కు ఈమాటలు సంపూర్ణంగా అర్థంకాలేదు. కాని ఆలేఖ్య గ్రహించింది. చిన్నప్పటినుంచీ ఆమెకు తండ్రి మీద ఆపేక్షవుంది. తన తల్లి ఆయన్ను అడుగడుక్కీ తిర

స్వాగతంగా మాట్లాడుతూండేది. ఆమెవలన కలుగుతూండే అవమానంనుంచి బయటపడేందుకు కాయన వ్యర్థప్రయత్నాలు చేసేవాడు. ఆయన వ్యక్తిత్వాన్ని ఆలేఖ్య బాగా ఎరుగు. ఆయన మాటల్లోని భావాన్ని ఆమె సులువుగా గ్రహించ గలదు. ఇప్పుడుకూడా ఆమె తండ్రి భావాన్ని గ్రహించింది. "అదేనా నీ ఉపదేశం, ఇకముందుకూడా అలా జరగాల్సిందేనా నాన్నా?'' అన్నది.

'కాదు కాదన్నట్లు'గా పలుసార్లు తలఊపారు రేగారు. "కాదమ్మా! అది నా ఉపదేశంకాదు. అది నీ తండ్రిగారి ఉప దేశం కాదు. ప్రపంచంలో అందరూ ఒకే రీతిగా నడవరు. శక్తి లేని వాళ్లుంటారు. ప్రకృతిభేదాలూ వుంటాయి. నువ్వుకూడా నా దారినే నడవగలిగితే నాకు సంతోషం. అంతమాత్రమే నేను చెప్పగలను.''

"దెబ్బలాట జరిగినచోటుకు వెళ్ళిరావాలని ఉంది నాన్నా! స్వయంగా వెళ్ళి చూస్తాను.''

"మంచిదమ్మా! నిన్ననే చెప్పాను మేనేజరుబాబుతో వ్యవహారం సరిజేసి రమ్మని. నదిలో నీళ్లువున్నాయి. పడవ సంతోషంగా వెళుతుంది.''

ఇందు ఇంతవరకూ ఏమీ మాట్లాడలేదు. జలయాత్రను గురించిన ప్రసంగం వచ్చేసరికి ఆమెముఖం వికసించింది. "నేను కూడా వస్తాను అలో'' అని ఉత్సాహంగా పలికి కిరణ్‌వైపు తిరిగి "ఏం అన్నయ్యా, అవసరమైన పనేమీ లేకపోతే నాలు గైదు రోజులు వుండిపోదాం'' అన్నది.

"ఎందుకూ? ఏమైనా కారణం ఉండాలిగా!''

"మాతోపాటు నువ్వుకూడా వద్దువుగాని. నదిలో పడ వెక్కి నువ్వెప్పుడూ ఎక్కడికీ వెళ్ళలేదు. వస్తావు కదూ!"

కమలకిరణ్ ఆలేఖ్య ఉద్దేశాన్ని తెలుసుకోవాలని చూశాడు. కాని ఆ సమయంలో ఆమె మరొకవైపు చూస్తూ వుంది. ఆమె ముఖలక్షణాలు తెలుసుకునే అవకాశం కమల కిరణ్‌కు దొరక లేదు. చెల్లెలి కుతూహలం తెలుస్తూనే వుంది. కమలకిరణ్ గుండె కొట్టుకోసాగింది. హృదయంలోని ఉత్సుకత ముఖంలో కనిపించనీయలేదు. నిస్పృహగా "వద్దులే. తిరిగి వచ్చేసరికి.చాల ఆలస్యం ఔతుందేమో! సరే, ఆలస్యం కాక పోతే వెళదాం."

"తప్పకుండా వెళ్ళండి బాబూ! కాని ఎక్కడా వివాదం పెట్టుకోకండి. అమరనాథ్‌కూడా అక్కడే వుంటాడు. ఇందూ, ఇక నాకు విశ్రాంతి ఇప్పించండి—" అంటూ చింతిత ముఖుడై మెల్లిగా లేచివెళ్ళాడు.

౮

రాయ్‌సాహెబుగారి ఎస్టేటు అంత పెద్దదికాదు,అయినా ఆదాయాన్నిబట్టి చూస్తే అంత చిన్నదనటానికీ వీల్లేదు. ఇన్నాళ్ళనుంచీ యజమానిగారు విదేశాల్లోనో, దూరపు పట్నాల్లోనో వుంటూవచ్చారు. పనిపాటలూ, శిస్తువసూళ్లూ— ఈ బాధ్యతఅంతా ఉద్యోగస్థులమీదే వుండేది. ఇంతవరకు ఎస్టేటు వ్యవహారాలు బాగానే సాగాయి. నిర్వహణ బాధ్యత ఉద్యోగస్థులపై వున్నా వ్యవహారాలు సక్రమంగానే సాగిపోతు న్నాయి. అందుకుకారణంప్రజల ధర్మభీరుత్వంకావచ్చు; విచార శీలిమైన రేగారి అదృష్టం కావచ్చు. ఆదాయం పెరగలేదుగాని,

దొంగతనాలు, లంచగొండితనాలు మొదలైనవేమీ లేవు. అంతా ఆలేఖ్య చేతుల్లోకి వచ్చేసరికి ఒక విచిత్రమైన మార్పు వచ్చేసింది. ఆమె కాఠిన్యంచూసి ప్రజలు, నౌకర్లు భయపడ్డారు. గంగూలీ మరణానంతరం ఆమె కాఠిన్యం చాలవరకు తగ్గిపో తుందనుకున్నారు. కాని సంతలో జరిగిన వ్యవహారాలనుబట్టి ఆమె పూర్వంకంటే ఎక్కువ కాఠిన్యతను దాల్చింది. నిన్న అమరనాధ్‌తో జరిగిన వాగ్వాదాన్నిబట్టి తెలిసినఅంశం ఏమంటే, ఇటీవల ఆమెకు తాత్కాలికంగా కలిగిన చింత, గ్లాని సమసి పోయాయి. ఇతర్ల సంపత్తిపై దాడిచేసేవాళ్ళ ముఠాలు దేశ మంతా లేచాయని ఆమె నిశ్చయం చేసుకుంది. అమరనాధ్ ఎంత మంచి ఉపాధ్యాయుడని పేరుపడినా ఆటువంటి ముఠాకు అధిపతియని విశ్వసించింది.

ఆదాయం ఎంత వస్తున్నదీ, స్థిరాస్తులు ఎక్కడెక్కడ వున్నదీ, ఈ వస్తువిషయాలూ సంపూర్ణంగా తెలుసుకోవాలని ఆలేఖ్య నిశ్చయించుకుంది. ఆ నిశ్చయాన్ని క్రియారూపంలో పెట్టటానికి ఆమె ఇవ్వాళ ఆయత్త అయింది. ఉదయాన్నే మేనేజరును పిలిపించి కమలకిరణ్ సహాయంతో విషయసేకర ణకు దిగింది. పల్లం, మెట్ట, బంజరు ఈ వివరాలన్నీ జ్ఞాపకం పెట్టుకోవాలంటే వాళ్ళకు చాల కష్టంగా వుంది. స్నానం, భోజనం అన్నీ మరచిపోయారు. నౌకర్లువచ్చి పలుసార్లు జ్ఞాపకంచేసిన మీదట లేచారు. భోజనాదికాలు నిర్వర్తించి మళ్ళీవచ్చి కూర్చున్నారు. ఇంతలో శేగారు చేతిలో బెత్తం పుచ్చుకుని బైటికి వెడుతున్నాడు. వెడుతూ ఇద్దరు కనిపిస్తే ఆశ్చర్యచకితుడై అడిగాడు. "ఒక్కతెవే ఉన్నావేం అమ్మా! అంతా ఏరీ?"

"అన్నయ్యా, ఆలో, ఎస్టేటు మ్యాప్ (పటం) తయారు చేస్తున్నారు. ఇంకా పూర్తికాలేదు."

"మ్యాప్ ఏమిటి ?"

"ఎస్టేట్ మ్యాప్; ఎక్కడెభూములు ఉన్నాయో, సూక్ష్మంగా తెలిసేందుకు."

రేగారు నవ్వారు. "వాళ్ళకు నీ సహాయం అక్కర్లేక పోయిందా ?"

దానికి జవాబుగా ఇందు ఒక చిరుహాసం మాత్రమే విసిరింది. మరికాసేపు ఆగి "మీరు ఎక్కడికి వెడుతున్నారు మామయ్యా !" అని అడిగింది.

'మామయ్యా' అన్న ఈ క్రొత్త సంబోధనకు రేగారు తను మనఃప్రాణాలు పులకించాయి. ఆమె ముఖంలోకిచూస్తూ చివరకు అన్నాడు: "నా చిన్ననాటి మిత్రుడొకడు సుస్తీపడి ఇంటికి వచ్చాట్ట. అతన్ని చూచిరావటానికి వెడుతున్నాను."

"నేనూ వస్తాను మామయ్యా !"

"దగ్గరకాదమ్మా ! ఒక మైలు నడవాలి. అలసిపోతావు"

"నేను చాలదూరం నడవగలను" అంటూ ఇందు రేగారి చెయిపట్టుకుని ముందుకుసాగింది.

"బగ్గీమీద వెడదామా ?" ప్రస్తావించాడు రేగారు. ఇందు ఆ మాట వినిపించుకోలేదు.

సరైన రోడ్లులేవు, ఎగుడుదిగుడు మార్గం. కాసేపు చెరువుగట్టుమీదినించి వెళ్ళారు. ఆ తరువాత కొంతదూరం నదివొడ్డునే నడిచారు. తరువాత సందులు, గొందులు. ఒక్కొక్కప్పుడొకరి ప్రాంగణంలోనించి వెళ్ళాలి. ఇందుకు సంకో

చంగా వుండేది, స్త్రీలు పనిపాటలు విడదిపెట్టి వీళ్ళకేసి అదే పనిగా చూచారు. మగవాళ్ళు ఎస్టేటుదారును చూడగానే మర్యాదగా లేచి నిల్చునేవాళ్ళు. స్త్రీలు ముసుగులు సవిరించుకునేవాళ్ళు కొంతదూరంపోయాక మైదానం వచ్చింది. "ఇక్కడి ఆడపిల్లలంతా మన ఆడపిల్లల్లాగా లేరే!" అన్నది ఇందు.

"ఔను. అలాగే కనిపిస్తుంది"

"మామయ్యా! వీళ్ళదృష్టికి మనం జంతువుల్లా కనిపిస్తున్నాం అనుకుంటాం కదూ!" అంటూ ఇందు సిగ్గుపడిపోయింది.

రేగారు జవాబేమీ చెప్పలేదు. నవ్వాడు. కొంత దూరం మౌనంగా నడిచాక ఇందు అన్నది. "ఒకవిధంగా చూస్తే వీళ్ళంతా బాగానేవున్నారు, హాయిగా"

రేగారు మందహాసం చేశాడు: "ఒకవిధంగా చూస్తే ప్రపంచమంతా బాగానేవుంటుంది హాయిగా"

"అదికాదు మామయ్యా! వీళ్ళంతా మనకంటే సుఖంగా కాలక్షేపం చేస్తున్నారని నా అభిప్రాయం."

దానికి సూటిగా సమాధానం చెప్పకుండా రేగారు అడిగారు. "అయితే మీరుకూడా వీళ్ళలాగే బ్రతకగలరా!"

"'మీరు' అంటే ఎవరని? అలోకు పల్లెటూరి జీవితం ఇష్టంలేదు. నా మాట చెప్పమంటారా? నాకిష్టమే" అని కాసేపు ఊరకుని ఏమాలోచించుకుందో మళ్ళీ ఇలాచెప్పింది:

"అమ్మకూ: నాన్నకూ నేనంటే యిష్టం తక్కువ. మన సమాజంలోని పిల్లలు పరోక్షంగా నన్ను ఎగతాళిచేస్తూ

వుంటారు. అయినా నేను వాళ్ళతో సాటిగా వుండలేక పోతు న్నాను. నా మనస్సులో ఒక ద్వంద్వయుద్ధం సాగుతూవుంది. మన సమాజంలో ఏయేవస్తువులు మిక్కిలి ఆవశ్యకతములని భావిస్తున్నామో వేటిసహాయంతో మన జీవనయాత్ర సాగి స్తున్నామో, వాటిలో చాలభాగం నిస్సారములనీ, నిరర్థకము లనీ నాకు తోస్తూవుంటుంది. అమ్మ ఉద్దేశంలో అవన్నీ సభ్యతా చిహ్నాలు. సభ్యమానవులను అపరిహార్యములు నాకు బాగుండదు."

రేగారు ఇందుముఖంలోకి పరీక్షగా చూచాడు. మంద హాసంతో అతనిముఖం వికసించింది.

ఇందు తన మనోభావం చెప్పేసింది. చెప్పినతర్వాత సంకోచించింది. రేగారి సమక్షంలో ఆధునిక సభ్యతను విమ ర్శించటం ఉచితం కాదేమోననిపించింది. అందుకు పరిహారంగా మళ్ళీ ఇలాచెప్పింది. "ఆధునిక సభ్యతను హర్షించేవాళ్ళను నేనేమీ విమర్శించటంలేదు మామయ్యా! దాన్నిచూచి ఉద్విగ్నులయ్యేవారిని గురించే చెప్పాను. మీకు కోపం వచ్చిం దేమో!"

"లేదమ్మా! కోపం ఎందుకూ?" అన్నాడు స్నేహపూర్వకమైన దిగా రేగారు నవ్వుతూ.

"చూడండి, వారికి అటూఇటూ సిగ్గుపడుతూ ఆడ పిల్లలు నిల్చున్నారు. కొందరు నమస్కారాలు పెడుతున్నారు. మనకూ వాళ్ళకూ ఎక్కడా పోలికలేదు. అందుచేత నే వీళ్ళంతా ఏకదమ్మున అసభ్యులై పోయారా? దుస్తులు నిండుగాలేవు. కాళ్ళకు చెప్పులులేవు. లేకపోతేయేం? భిడియపడాల్సిన అవసరం ఏముంది?"

రేగారు జవాబేమీ చెప్పటంలేదు. మధ్యమధ్య చిరు నవ్వుమాత్రం ప్రకటిస్తున్నారు.

"మీరు నామాటల్ని ఖండించటంలేదు. అంగీకరించటమూ లేదు. మీకు కోపం వచ్చింది కామాలు."

ఇప్పుడు నోరుతెరచాడు రేగారు. "నన్ను అపార్థం చేసుకోకు అమ్మా: మీ మామయ్య నిన్ను లోలోపల ఆశీర్వదించుకుంటున్నాడు. సరే, మీ అన్నయ్య అభిప్రాయం ఏమిటి?" ఇందు నేత్రాల్లోకి కుతూహలంగా చూచాడు రేగారు. ఆయనకు కుతూహలాన్ని, దాని హేతువును గ్రహించింది ఇందు. కాని ఏమి చెప్పాలో ఆమెకు స్ఫురించలేదు.

ప్రసంగం ఎట్టిదైనా పట్టుదలగా అడిగి తెలుసుకోవాలని ప్రయత్నించాడు రేగారు. బాలిక ద్వైధీభావాన్ని గ్రహించాడు. ప్రసంగం మారుస్తూ అడిగాడు: "అమ్మాయి మీరెప్పుడు వెడుతున్నారేమిటి?"

"ఎక్కడికి మామయ్యా!"

"ఎస్టేటు తనఖీ చెయ్యటానికి"

"ఆ సంగతి నాకు వాళ్ళేమీ చెప్పలేదే! అయినా ఆ పనిలో నాకు ఆనందం లేదు. మీకు అభ్యంతరం లేకపోతే నేను మీదగ్గరే ఉండిపోతాను. నాకు హాయిగా ఉంటుంది"

స్నేహితుని యిల్లు వచ్చేసింది: రేగారు బెత్తం ఎత్తి చూపుతూ "అదే యిల్లు ఇందూ! వచ్చేశాం" అన్నాడు.

ఇందు ఎందుకో సంకోచించింది. "నేను మీరు వచ్చేదాకా, ఈ మైదానంలో తిరుగుతూ ఉంటాను. మీ మిత్రుడితో నాకు పరిచయం లేదాయెను. ఒక అరగంట పడుతుందనుకుంటాను."

"అమ్మా! ఇది నా గ్రామం. పరిచయంతో అవసరం లేదు. అయినా నిన్ను నేను నిర్బంధపెట్టను. ఒకసుస్తీ మనిషి దగ్గర కూచోటంకంటే హాయిగా మైదానంలో షికారు చెయ్యటం శ్రేష్ఠతరం కాదని నేనెలా అనను? అది మాత్రం జాగ్రత!"

ఇందు ముందుకు సాగింది. రేగారు కొంచెం బిగ్గరగా చెప్పారు: ఈ మైదానానికి అవల ఒక బస్తీ కనిపిస్తూఉంటుంది. మైదానందాటి పదిఅడుగులు వేస్తే అమరనాథ్ పాఠశాల చేరుతావు. అక్కడికి వెడితే మాత్రం అమరనాథ్‌తో చెప్పు: "రేపు ఒకసారి కలవమన్నానని"

రేగారు తన మిత్రుని యింట్లోకి వెళ్ళారు.



మైదానంలో కాలిబాట ఉంది. ఎవరినీ త్రోవ అడగవలసిన పనిలేదు. ఇందు తిన్నగా మైదానపు అవలి అంచు దగ్గరకు వెళ్ళింది. అక్కడ ఒక పెద్దమర్రిచెట్టు ఉంది. ఆ చెట్టుక్రిందే అమరనాథ్ పాఠశాల. పది పన్నెండుమంది శిష్యులు చుట్టూ కూర్చున్నారు. న్యాయశాస్త్ర పాఠం చెబుతున్నాడు అమరనాథ్. ఇందు వచ్చి అక్కడ ఆగింది.

అమరనాథ్ తన కన్నులనే తాను నమ్మలేకపోయాడు. వెంటనే ఏమీ మాట్లాడలేక పోయాడు. శిష్య సమేతంగా లేచి నిల్చున్నాడు, స్వాగతవాక్యం చెప్పి "ఎంత మహాభాగ్యం నాకు ఇవాళ? అంతా ఏరీ?" అని అడిగాడు.

ఒక శిష్యుడు ఆసనం తెచ్చి వేశాడు. మొదట చెప్పులు విడవటం మరచి పోయింది ఇందు. తరువాత గుర్తు తెచ్చుకుని విడిచింది. వచ్చి అసనంమీద కూర్చుంది. "నే నొక్కర్తె నే వచ్చాను; వాళ్ళెవరూ రాలేదు"

అమరనాథ్‌కు ఆమాట అసంభవంగా తోచింది. ఆమె ఒక్కతే ఎలా రాగలుగుతుంది?

"ఇంటినించి మామయ్యతో కూడా బయలు దేరాను. ఆయన ఒకసు స్త్రీగా ఉన్నమిత్రుని చూడ్డానికి వెళ్ళారు. నేను ఇలా వచ్చాను. మిమ్మల్ని రేపొకసారి కలుసుకోవలసిందిగా మామయ్య చెప్పారు"

"అ కబురు మరెవ్వరైనా తీసుకురారూ! వారి దగ్గర నౌకర్లకేం తక్కువ? అయినా మీరు రావటం నాకు మహా భాగ్యం. రాయ్‌మహాశయ్ ఎవరింటికీ చూడ్డానికి వెళ్ళింది?"

"ఆయనపేరు నాకు తెలియదు. ఇల్లుమాత్రం చూచాను. మీ యిల్లెంత దూరం ఇక్కడినించి? అమరనాథ్ బాబూ!"

"రెండు నిమిషాల నడక"

"నాకు కాసిని మంచినీళ్ళు తెప్పించండి"

వెంటనే ఒకవిద్యార్థి లేచివెళ్ళాడు. కాసేపటిలోనే ఒక పాత్రలో ఇంత జున్ను, ఒక గ్లాసులో మంచినీరు తెచ్చి తెచ్చిపెట్టాడు. "ఎబ్బే, నేనేమీ తిననండి, ఆకలిలేదండీ" అంటూ శిష్టాచారం ప్రకటించ లేదు ఇందు. మాట్లాడకుండా జున్నుతిని మంచినీళ్ళు తాగేసింది. "ఇక వెళతాను, సెలవు"

అన్నది. ఆమె సుశిక్షితమైన బాలిక, సరళస్వభావంగల మనిషి అమరనాథ్ చాల సంతోషించాడు.

"మీరైకోరివచ్చారు. వెంటనే వెళ్ళనిస్తానా? ఈ దరిద్రబ్రాహ్మణుని కుటీరం మీ చరణధూళితో పావనం కావద్దూ! మా అమ్మవుంది, అక్కవుంది; అత్తగారింటినుంచి మా చెల్లెలు వచ్చింది. అందర్నీ చూడకుండా ఎలా వెళతారు-రండి."

ఇందు వ్యతిరేకించలేదు. "పదండి అయితే. మరి మామయ్య నాకోసం గాభరాపడతారేమో!"

"గాభరా ఎందుకు కబురు వెడుతుందిగా!"

పాఠశాల వెనుకనే ఒక తోటవుంది. ముందుగా ఒక పెద్ద చెరువువుంది. తోటలో రకరకాల పూలు వికసించివున్నాయి. ముందు అమరనాథ్, వెనుక ఇందుమతి. ఇద్దరూ ఆవరణలో ప్రవేశించారు. ఒకపెద్ద చండీమండపం కనిపించింది. ఆ సాయంత్రపు వెలుగులో ఆ మండపంలో కూర్చుని ఇద్దరు విద్యార్థులేదో రాసుకుంటున్నారు. మండపానికి అవతలవైపు అయిదారు బలిసిన ఆవులు కొన్ని గడ్డిమేస్తున్నాయి, కొన్ని గానుగపట్టు తింటున్నాయి. దూడలుకూడా కట్టేసివున్నాయి. బొచ్చు బాగా పెరిగిన ఒక వల్లకుక్క వుంది. ఆగంతకులను చూచి అది తోకఆడిస్తూ స్వాగతసత్కారాలు చూపింది. తూరుపువైపున ధాన్యపుకొట్టు సౌభాగ్యాన్ని సూచిస్తూ ఉన్నాయి. ఒక మందార వృక్షం ఎర్రని పూలతోనిండి శోభనించుతోంది.

చివరకిద్దరూ గృహప్రాంగణంలో అడుగుపెట్టారు.

మట్టిగోడల యిల్లు. ముంగిలి పేడతో అలికి శుభ్రంగా వుంది. చెప్పులు తొడుక్కుని నడిస్తే జారిపోయేటంత నున్నగా వుందక్కడ. అప్పుడే చీకటిపడుతోంది. ప్రాంగణంలో వికసించిన పూల పరిమళంతో గాలి పులకించింది.

అమరనాథ్ అక్క వితంతువు దేవతార్చనలో నిమగ్న అయింది. కబురు తెలియగానే తల్లి పరిగెత్తుకువచ్చింది. చంటి పిల్లవాడి నెత్తుకుని అమరనాథ్ చెల్లెలుకూడా వచ్చింది. ఇందు అమరనాథ్ తల్లికి పాదాభివందనం చేసింది. ఆమె ఇందు చుబుకంస్పృశించి ముద్దాడి, ప్రియవాక్యాలు పలికింది. ఇంతప్రేమ, ఆదరం తన కిదివరకెప్పుడూ ఎక్కడా లభించియుండలేదని ఇందుకు తోచింది.

పంచపాళీలో ఒక ఆసనంవేసి "కూచోఅమ్మా" అన్నది అమరనాథ్ తల్లి.

"సాయంత్రం అయిందో లేదో మా యింటికి లక్ష్మి వచ్చింది" అన్నదామె ఇందు కూర్చోగానే.

ఇందు బాగా చదువుకున్నపిల్లే అయినా నోటివెంట మాటరాలేదు. ఆ యింటివారి శిక్షణ, సంస్కారం, ఆచారాలు అదోకలా ఉన్నాయి. జాతివివక్షణ అనేది వారిలో ఎక్కడా కనిపించదు. అయినా ఆ వృద్ధ వితంతువు సమక్షంలో ఇందుకు ఎట్టి సంకోచం ఉత్పన్నమైందో ఆమెకే తెలియాలి. "మీరు బ్రాహ్మణులు! నేను కాయస్థుల బిడ్డను. మీరు స్వయంగా మీ చేతులతో నాకు ఆసనం వేశారేం?" అని అడిగింది.

"నువ్వు నా లక్ష్మివి. సరిగ్గా సంధ్యా సమయంలో.

వచ్చావు. దేవతలకు జాతియేమిటి? నువు జాతులన్నింటినీ మించినదానివి."

అమరనాథుని చెల్లెలు ఇంచుమించు ఇందు సమవయస్కురాలు. ఆమెకూడా వచ్చి చేరువనే కూర్చుంది. ఇందు ఆమె పసిబిడ్డను తన చేతుల్లోకి తీసుకుంది.

"అమ్మాయీ! నీపేరు చెప్పాలి" అన్నది అమరనాథ్ తల్లి.

"నాపేరు ఇందుమతి"

"ఔను. అంత అందగత్తె, పేరు మరొకటి ఎలా ఔతుంది."

ఇందు సిగ్గుపడ్డది. పైటచెరుగు అడ్డంపెట్టుకుని మందహాసం చేసింది. "మరొకసారి వస్తే మీరేమంటారో ఆలోచిస్తున్నాను"

"వచ్చినప్పుడు చెబుతాను. తప్పకుండా రావాలి సుమీ!"

ఇందు వస్తానని హామీ యిచ్చింది.

అమరనాథ్ అక్క దేవతార్చన పూర్తిచేసి వచ్చింది. "హారతి అయింది. ప్రసాదం పుచ్చుకోకుండా వెళ్ళటానికి వీల్లేదు" అన్నది ఇందును ఉద్దేశించి.

ఆమె యెవరో ఇందు ఊహించుకుంది. "నేను ప్రసాదం ఇదివరకే తిన్నాను. మరో రోజున వచ్చినప్పుడు తప్పకుండా మీ దేవతాప్రసాదం పుచ్చుకుంటాను. ఇవాళ ఇక్కడ ఖాళీ లేదసలు" అంటూ తన పొట్టవైపు చూపించింది. "సెలకత్తాకు వెళ్ళిపోయేముందు మళ్ళీ తప్పకుండా వస్తాను. మీ దేవతా

ప్రసాదం, మీ అమ్మగారి పాదధూళి నాకు అవశ్యం కావాలి" అన్నది.

ఇందు ఇంటికి బైలుదేరేసరికి బాగా చీకటి పడింది. అమరనాథ్ చేతిలో లాంతరు ఉంది. "లాంతరు ఎవరికైనా ఇవ్వండి. నన్ను పంపించి వస్తారు."

"నేను గాక ఇంకెవరు పంపించటానికి వస్తారు ?"

"అంటే ?"

"మీరు స్వయంగా మా యింటికి వచ్చారు. నేనుగాక మరింకెవరేనా మిమ్మల్ని పంపించేందుకు వచ్చేట్లయితే నేను నా కర్తవ్యవిపంచి వంచితుడనౌతాను"

"మీరు తిరిగి వచ్చేసరికి చాలరాత్రి అయిపోతుంది మరి !"

"అయితే ఔతుంది. కర్తవ్యపాలన వల్ల లభించే ఆనం దాన్ని కూడా ఆలోచించండి"

ఇందు గంభీరముద్ర వహించింది: "అయితే రండి. ఇవాళ నాకు ఒక పెద్ద భ్రమనివారణ ఐపోయింది. మీరు మిక్కిలి దరిద్రులని మేమింతవరకూ భావించాం సుమీ !"

అమరనాథ్ మాట్లాడలేదు. మరికాసేపటికి ఇందు అన్నది. "మీ యింటికి మళ్ళీ రావాలని కోరిగ్గావుంది. అంతే కాదు. ఆవేశ్యా యింటినుంచి వచ్చేసి మీ యింట్లోనే మీ అమ్మగారిదగ్గర నాలుగురోజులు ఉందామనిపిస్తోంది."

లాంతరు వెలుగులో అమరనాథ్ ఇందు ముఖకవళికను పరీక్షిస్తూ చూశాడు. మెల్లగా అన్నాడు: "అటువంటి భాగ్యం నాకు కలగగలదని కలలోనైనా ఊహించలేదు."

99

## పాఠకులకు...

ఇది శరత్ అసంపూర్తి నవల. దీనిని పూర్తిచేయకుండానే శరత్ బాబు దివంగతుడైనాడు. దీనిని మా స్వకల్పనతో పూర్తిచేసి ప్రచురిద్దామనుకున్నాము. కాని శరత్ ని జీర్ణంచేసుకున్న పాఠకులు ఆంధ్రదేశంలో అసంఖ్యాకులున్నారు. వారి అభిప్రాయాలను కూడా సేకరించి, తదనుగుణంగా పూరించటం ఉత్తమ మనిపించింది. గాన ఇది చదివిన పాఠకులు దీనిని ఎలా ముగించితే బాగుంటుందో మీ మీ అభిప్రాయం తెలుపండి! రచయితలైతే పూరించే పంపండి! ఉత్తమ అభిప్రాయానికి, ఉత్తమ రచనకు తగిన బహుమతికూడా ఇవ్వదలచాం.

సెలవు.

ఇట్లు,
సంపాదకులు.

## సంపూర్ణ శరత్ సాహిత్యం

### 'శివరామకృష్ణ' అనువాదాలు

| | | |
|---|---|---|
| శ్రీకాంత్ | 7 | 8 |
| చరిత్రహీనులు | 5 | 0 |
| భారతి | 5 | 0 |
| శేషప్రశ్న | 4 | 0 |
| సవిత | 4 | 0 |
| భైరవి | 3 | 0 |
| విప్రదాసు | 3 | 0 |
| గృహదహనం | 3 | 0 |
| దత్తా (విజయ) | 1 | 8 |
| సుభద | 1 | 8 |
| పల్లీసమాజ్ | 1 | 8 |
| దేవదాసు | 1 | 8 |
| బ్రాహ్మణ పిల్ల | 1 | 8 |
| విరాజ్ బహు | 1 | 8 |
| పూజారిణి | 1 | 8 |
| పంతులుగారు | 1 | 8 |
| నవవిధాన్ | 1 | 8 |
| ఆడబ్రతుకు (నారీర్ మూల్య) | 1 | 8 |
| కట్టుతెగిన పిల్ల (అరక్షణీయ) | 1 | 8 |
| వైకుంఠుని వీలునామా | 1 | 8 |
| దగయు (చంద్రనాథ్) | 1 | 8 |
| శరత్ ఉత్తరాలు | 1 | 8 |
| శరత్ జీవితం | 1 | 8 |
| జాగరణ | 0 | 12 |
| శరత్ అసంపూర్తి కథలు | 0 | 12 |
| స్వామి (మావారు) | 0 | 12 |
| గర్వభంగం, మహేశుడు | 0 | 12 |
| నిష్కృతి | 0 | 12 |
| అనూరాధ, రాగదీపం | 0 | 12 |
| రాముని బుద్ధిమంతతనం | 0 | 12 |
| బిందుగారబ్బాయి | 0 | 12 |
| తీరని కోరికలు | 0 | 12 |
| బడదీది | 0 | 12 |
| పరిణీత | 0 | 12 |
| కాశీనాథ్ | 0 | 12 |
| పతివ్రత, ఏకాదశీ బైరాగి | 0 | 12 |
| శరత్ కథలు : ఒకటవ భాగం<br>రాధారాణి, ఛాయా-ప్రకాశ్<br>అభాగిని స్వర్గం | 1 | 0 |
| శరత్ కథలు : రెండవ భాగం<br>అనుపమ ప్రేమ,<br>భారం, గుడిలో | 1 | 0 |
| శరత్ కథలు: మూడవ భాగం<br>విలాసి, చిత్రకారుడు,<br>హరిలక్ష్మి, హరిచరణ్ | 1 | 0 |
| శరత్ కథలు : నాలుగవ భాగం<br>హేమాంగిని, కేసుఫలితం,<br>పరేశుడు | 1 | 0 |

ఇదే సంపూర్ణ శరత్ సాహిత్యం, సరైన అనువాదాలు, సరసమైన ధరలలో లభిస్తాయి. ఇంకా అనేకమంది ప్రచురణ కర్తలు అనేక పేరు మార్పులలో ప్రచురించిన పుస్తకాలన్నీ ఇందులో వున్నవే.

# శరత్ సంపుటములు

మొదటి సంపుటి : శరత్ కథలు : నాలుగు భాగాలలోని 15 కథలు గర్వభగం, మహేశుడు.

రెండవ సంపుటి : ఆడబ్రతుకు, దేవదాసు, అనూరాధ, తీరని కోరికలు, రాగదీపం.

మూడవ సంపుటి : కాశీనాథ్, నవవిధాన్, పరిణీత, బిందుగారబ్బాయి, బడదీది.

నాలుగవ సంపుటి : బ్రాహ్మణ పిల్ల, వైకుంఠుని వీలునామా, రాముని బుద్ధిమంతతనం, కట్టుతెగిన పిల్ల.

ఐదవ సంపుటి : స్వామి, సరయు, పతివ్రత, పంతులుగారు, నిష్కృతి,

ఆరవ సంపుటి : జాగరణ, శరత్ అసంపూర్తి కథలు, శరత్ ఉత్తరాలు,

ఏడవ సంపుటి : శ్రీకాంత్

ఎనిమిదవ సంపుటి : చరిత్రహీనులు

తొమ్మిదవ సంపుటి : భారతి

పదవ సంపుటి : శేషప్రశ్న

పదకొండవ సంపుటి : గృహదహనం, పూజారిణి

పన్నెండవ సంపుటి : విరాజ్ బహు, సుభద, పల్లీసమాజ్

పదమూడవ సంపుటి : సవిత, దత్తా

పద్నాలుగవ సంపుటి : భైరవి, విప్రదాస్

ఒక్కొక్క సంపుటి 5-0-0, ఏడవ సంపుటి మాత్రం -8-0 శరత్ అభిమానులకు ప్రత్యేకంగా శరత్ రచనలన్నీ ఒకే సైజున 14 సంపుటములుగా ప్రచురించి చక్కని బైండ్లుగా తయారుచేశాం, ముచ్చటగొలిపే జాకెట్టు. 14 సంపుటములు ఒకేసారి కొరుగా మా వద్దనే తీసుకునేవారికి 65 రూపాయయిలకే లభిస్తాయి...





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRWA 109 B 142 |
| పుస్తకం పేరు | జాగరం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 107 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ,100,101,104 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | alkshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | K Daveep |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |